


స్టంప్ ఎగురుతోంది అది ఏమండీ? ఆటయొక్క నిజమైన శక్తియేనండీ

**పార్లే-జి**

పరిపూర్ణమైన రుచి, పరిపూర్ణమైన శక్తి.

భారతదేశపు అత్యధికంగా అమ్ముడవుతున్న బిస్కట్లు.

everest/93/PP/173-tt




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## విశ్వమానవ సౌభ్రాతృత్వం

మహాత్మాగాంధీ గుజరాత్ విద్యాపీఠాన్ని స్థాపించిన నాలుగేళ్ళ తరవాత, 1924వ సం॥లో అక్కడి విద్యార్థులను ఉద్దేశించి ఉపన్యసిస్తూ — హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు, పార్సీలు, యూదులు అందరూ అన్నదమ్ములలాగా మసలుకోవాలని చెప్పాడు. విశ్వమానవ సౌభ్రాతృత్వం అంటే కేవలం నమ్మకం ఉంటే చాలదు; దానిని ఆచరణలో చూపాలి, అని ఆయన ఉద్బోధించాడు. ఆ భావంలో నమ్మకం లేనివారికి విద్యాసంస్థలో స్థానం లేదని కూడా నిర్మొహమాటంగా చెప్పాడాయన.

గాంధీజీ సంపాదకత్వం వహించిన 'యంగ్ ఇండియా' పత్రికలోనూ, తన ఉపన్యాసాలలోనూ ఈ అభిప్రాయాన్నే ఆయన తరచూ వెలిబుచ్చేవాడు. ప్రాంతీయ, కుల, మత భేదాలు పాటించకుండా మానవులందరూ ఒక్కటేనన్న ఉదాత్త ఆశయంతో యువతీ యువకులు ముందుకు సాగాలని గాంధీజీ కాంక్షించాడు.

ఇటువంటి విశాల దృక్పథం కలిగించడంలో విద్య కీలకమైన పాత్ర వహిస్తుంది. ప్రతిచోటా, ప్రతివారితోనూ ఐకమత్యాన్ని సమకూర్చేదే సరైన విద్య అన్నాడు ఆదిశంకరుడు. అయితే, ఆధునిక విద్యావిధానంలో ఈ సందేశం లోపించడం దురదృష్టకరం!

విద్యార్థికి తనను తాను ఉద్ధరించుకుని, ఇతరులను కూడా ఉద్ధరించడానికి మార్గం చూపేదే ఉత్తమమైన విద్య. అటువంటి విద్యే మానవతకు పరిపూర్ణతను ఇస్తుంది. ఆ పరిపూర్ణతను సాధించడానికి ప్రతిఒక్కరూ కృషి చేయాలి.

సంపుటి: 93 ఫిబ్రవరి '94 సంచిక: 2

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00







Sunday, Piano, Nursery Rhymes
It's Morton for me all the time



# MORTON
SWEETS

I Love my Sundays ..... Nursery Rhymes and my Mummy close to me and Mortons all the time. It has been our Family's favourite for years and years.

Delicious and yummy in so many flavours. All with the goodness of Creamy Milk, Glucose and Sugar.

Chocolate and Coconut Cookies, Rose Eclairs, Supreme Chocolate and Coconut Toffees, Lacto Bonbons Mango King and so many other delicious treats.

Um m m m m Every bite a yummy delight.

*A lifetime of real goodness*

**MORTON CONFECTIONERY & MILK PRODUCTS FACTORY**
P.O. : Marhowrah 841 418 Dist. : Saran, Bihar

CC/M-1/93

**Caution Notice :**

వార్తలు - విశేషాలు :

# మహామస్తకాభిషేకం!

కుంభమేళా లాగా, గోదావరి పుష్కరాల లాగా బాహుబలి మహామస్తకాభిషేక మహోత్సవం కూడా పన్నెండేళ్ళ కొకసారి జరుగుతుంది. కర్నాటక రాష్ట్రం హసన్ జిల్లా శ్రావణబెళగొళలోని ఇంద్రగిరి గుట్ట మీద బాహుబలి విగ్రహం ఉన్నది. ప్రపంచంలోకెల్లా చాలా ఎత్తయిన ఏకశిలావిగ్రహం ఇదే! క్రీ.శ. 981 వ సం॥లో ఈ విగ్రహ ప్రతిష్ఠాపన జరిగింది. ఇరవైయవ శతాబ్దంలో ఏడుసార్లు అంటే 1900, 1910, 1923, 1940, 1953, 1967, 1981 వ సంవత్సరాలలో మస్తకాభిషేకాలు జరిగాయి. ఈ శతాబ్దంలో ఎనిమిదవదీ, ఆఖరిదీ అయిన మస్తకాభిషేకం 1993 డిసెంబర్ 19వ తేదీ అత్యంత వైభవంగా జరిగింది. విగ్రహ ప్రతిష్ఠాపన తరవాత 85వసారి జరిగిన ఈ మహోత్సవంలో అసంఖ్యాకులయిన భక్తులు పాల్గొన్నారు. మహోత్సవ కార్యక్రమాలను భారీ ఎత్తున ఏర్పాటు చేశారు. శుభ నక్షత్ర గ్రహ కూటమిని అనుసరించి ఈ ఉత్సవాన్ని ఏర్పాటు చేస్తారు. అందువల్ల పన్నెండేళ్ళలో కాస్త అటూ ఇటూ తేడాలు వస్తాయి.



ఇరవైనాలుగుమంది తీర్థంకరులలో ఆఖరివాడైన వర్ధమాన మహావీరుడు జైనమతం స్థాపించాడు. మొదటి తీర్థంకరుడు ఆదినాథ్ ఋషభదేవుడు రాజు. ఆయన ఇహలోక బంధాలను త్యజించి, పెద్ద కుమారుడయిన భరతుడికి అయోధ్యనూ, రెండవ కుమారుడయిన బాహుబలికి పోదనపురాన్ని అప్పగించాడు. భరతుడికి తమ్ముడి రాజ్యాన్ని కూడా కలుపుకోవాలన్న ఆశ కలిగింది. బాహుబలి ఎదురు తిరిగాడు. ఉభయ సేనల మధ్య యుద్ధం ఆసన్నమయింది. యుద్ధం అమాయకజనక్షయానికి దారితీస్తుందని మంత్రులు అన్నదమ్ములకు నచ్చచెప్పారు. ఇద్దరికీ మంత్రుల సలహా నచ్చి, ఉభయసేనల మధ్య కాకుండా అన్నదమ్ములు మాత్రమే యుద్ధం చేసి బలాబలాలను తేల్చుకోవడానికి సమ్మతించారు. అన్నదమ్ముల మధ్య దృష్టియుద్ధం, జలయుద్ధం, మల్లయుద్ధం జరిగాయి. మూడింటిలోనూ భరతుడు ఓడిపోయాడు. బాహుబలి అతన్ని రెండు చేతులతో పైకెత్తి నేలకేసి కొట్టబోయి ఆగిపోయాడు. అతనిలోని ఆగ్రహం చల్లారిపోయింది. జ్ఞానోదయమయింది. అత్యాశ, గర్వం తన అన్నను

ఎంతటి దీనస్థితికి తెచ్చిందో గ్రహించాడు. ఆ వైరాగ్యంతో తన రాజ్యాన్ని కూడా వదిలిపెట్టి వెళ్ళిపోయాడు.

తన చర్యకు పశ్చాత్తాపం చెందిన భరతుడు, తమ్ముణ్ణి ప్రపంచాన్ని త్యజించవద్దని కోరాడు. అయినా, బాహుబలి కృతనిశ్చయంతో నిద్రాహారాలు లేకుండా నిలబడి నెలల తరబడి తపస్సు చేశాడు. అతని చుట్టూ తీగలు మొలిచి ఆయన కాళ్ళకూ, చేతులకూ అల్లుకున్నాయి. భరతుడు మళ్ళీ వెళ్ళి, "శ్రమణా! ఏదీ కూడా నీదీ కాదు, నాదీ కాదు," అని చెప్పాడు. అయినా బాహుబలి తపస్సు మానలేదు. కొంతకాలానికి ఆయన మోక్షం పొందాడు. భరతుడు తమ్ముడి రూపంలో ఒక బంగారు విగ్రహం చేయించి, పోదానపురంలో ప్రతిష్ఠించాడు.

పదవ శతాబ్దంలో గంగ వంశానికి చెందిన రెండవ రాచమల్లు సంస్థానంలో ప్రధాన మంత్రిగానూ, సర్వ సేనాధిపతిగానూ చాముండరాయ్ ఉండేవాడు. అతని తల్లి కళ్ళల్ దేవికి బాహుబలి స్వర్ణ విగ్రహాన్ని దర్శించాలన్న కోరిక కలిగింది. ఆమె కొడుకునూ, ఆచార్యుడయిన అజిత్సేనుణ్ణీ వెంట బెట్టుకుని పోదానపురానికి బయలుదేరింది. వాళ్ళు మార్గమధ్యంలో చంద్రగిరి, ఇంద్రగిరి అనే రెండు కొండల మధ్య ఉన్న ప్రాంతంలో ఆగారు. ఆ రాత్రి ముగ్గురికీ ఒకే విధమైన కలవచ్చింది. వాళ్ళ కలలో కుష్మందినీ దేవి కనిపించి, "మీరు పోదానపురంలో స్వర్ణ విగ్రహాన్ని చూడలేరు. చంద్రగిరిపై నిలబడి దక్షిణ దిశగా ఉన్న ఇంద్రగిరి మీదికి బాణం వదలండి," అని చెప్పింది. అదే విధంగా మరునాడు ఉదయం చాముండరాయ్ చంద్రగిరి మీద నిలబడి ఇంద్రగిరి మీదికి బంగారు బాణం వదిలాడు. ఆ బాణం పడిన చోట బాహుబలి రూపం కనిపించింది.

చాముండరాయ్ బాహుబలి విగ్రహాన్ని చెక్కించి అక్కడ ప్రతిష్ఠించడానికి శిల్పులను రప్పించాడు. అరిష్టనేమి అనే శిల్పి నాయకత్వంలో బ్రహ్మాండమైన బాహుబలి ఏకశిలా విగ్రహం తయారయింది. ఇంద్రగిరి మీద 981వ సం॥ మార్చి 13వ తేదీ విగ్రహాన్ని ప్రతిష్ఠించి, చాముండరాయ్ మొట్టమొదటి మహామస్తకాభిషేకం చేయించాడు. చాముండరాయ్‌కి బాల్యంలో గోమత (సుందరుడు) అని పేరుండేది. అతడు ప్రతిష్ఠించడం వల్ల బాహుబలి విగ్రహానికి గోమతేశ్వరుడు అనే పేరు వచ్చింది.

ఉత్తరాభిముఖంగా ఉన్న ఈ విగ్రహం ఎత్తు 57 అడుగులు. ఆ విగ్రహం మోములో విలసిల్లే మధుర గంభీరమైన దరహాసానికి ముగ్ధులుగాని వారండరు. అది శాంతినీ, అహింసనూ ప్రపంచానికి చాటుతున్నట్టు ఉంటుంది. జైనమతం అహింసను బోధిస్తుంది. విగ్రహం పాదాల వద్ద చిన్న తటాకం ఉన్నది. దీనినే కన్నడంలో బెళగొళ అంటారు. సర్వాంగాలూ పరిపూర్ణమైన పరిమాణాలతో ఎంతో జాగ్రత్తగా చెక్కబడిన అద్భుతమైన కళాఖండం ఈ విగ్రహం!

### అభిషేక విధానం!

పూజా కార్యక్రమాలు దాదాపు పదిహేను రోజులకు ముందే ప్రారంభమయినప్పటికీ అసలు అభిషేకం పూర్తికావడానికి ఆరు గంటలు పడుతుంది. మొదట విగ్రహాన్ని చెరుకు రసంతోనూ, పాలతోనూ, మూలికల రసంతోనూ అభిషేకిస్తారు. ఆ తరవాత కింది తటాకజలం, వివిధ నదుల పవిత్రజలాలతో నిండిన 1008 కలశాలను భక్తులు తెచ్చి అభిషేకిస్తారు. ఆ పిమ్మట మూడు రకాల చందన ద్రవ్యాలతోనూ, వివిధ పుష్ప దళాలతోనూ మస్తకాభిషేకం జరుగుతుంది. ఆ తరవాత మామూలు జలంతో అభిషేకించి, సర్వసంగపరిత్యాగి అయిన బాహుబలిని అష్ట విధ ఫలపుష్పాలతో అర్చిస్తారు.



# విచిత్ర వీణ

సంగీతపురిలో ఒక్క సంగీత విద్వాంసుడు కూడా లేదు. సంగీత వాయిద్యాలను విక్ర యించే ఒక దుకాణం ఆ గ్రామంలో వుండడం వల్ల, ఆ ఊరుకు ఆ పేరొచ్చింది. వీణ, పిల్లన గ్రోవి, మృదంగం — ఇలా ఏ వాయిద్యం కావ లసివచ్చినా, ఆ దుకాణంలో తప్పక దొరుకు తాయి.

ఆ దుకాణం యజమాని పేరు రామావ తారం. అతడు వృద్ధుడైపోవడంతో, అతడి కొడుకు మురారి కొన్నాళ్ళుగా దుకాణం పనులు పర్యవేక్షిస్తున్నాడు.

సంగీతపురికి ఆమడ దూరంలో పాల కొండలున్నాయి. సంగీత వాయిద్యాలను తయారుచేసేందుకు కావలసిన శ్రేష్ఠమైన కలప అక్కడ లభిస్తుంది. నెలకొకసారి మురారి ఎడ్లబండిని, కూలీలను తీసుకొని, ఆ కొండలకు వెళతాడు. అక్కడ కావలసిన కలపను కూలీల చేత నరికించి, మురారి వాయిద్యాలను తయారుచేస్తాడు. ఆ దుకా ణంలో తయారయ్యే వాయిద్యాలకు చుట్టు పక్కల పట్టణాల్లో మంచి పేరుంది.

ఒకరోజు, ఆ దేశాన్నేలే మహారాజు కుమార్తె చారులత, శ్రేష్ఠమైన టేకుకొయ్యతో తయారు చేసిన మంచి వీణ కావాలని తన భటుణ్ణి పంపింది.

"ప్రస్తుతం అలాంటి వీణ దుకాణంలో లేదు. వారం, పది రోజుల్లో తయారుచేసి, నేనే కోటకు తీసుకువస్తానని, యువరాణి వారికి చెప్పు!" అని మురారి, ఆ భటుణ్ణి పంపించివేశాడు.

మర్నాటి ఉదయం, వీణ తయారీకి అవసరం అయిన టేకు కొయ్య కోసం, మురారి పాలకొండలకు, ఒక కూలీని మాత్రం వెంటబెట్టుకొని బయలుదేరాడు. ఆ రోజు ఎంత వెతికినా వాళ్ళకు సరైన టేకుచెట్టు కనిపించలేదు.

ఆర్. పట్టాభిరామరాజు



మిట్టమధ్యాహ్న సమయంలో మురారీ, కూలివాడూ వెంట తెచ్చుకున్న అన్నం తిని, తిరిగి మంచి చెట్టును వెతికేందుకు బయలు దేరారు. కొంతసేపటికి వాళ్ళ అన్వేషణ ఫలించింది. ఒక కొలను పక్కన వాళ్ళకు ఒక దృఢమైన టేకుమాను కనబడింది. చెట్టును పరిశీలించిన మురారి తృప్తిగా తలాడించాడు. అయితే, టేకుమాను అంతా గుబురు కొమ్మలతో వుండడం మాత్రం, అతడికి ఆశ్చర్యం కలిగించింది. కూలివాడు తన భుజం మీది పంచెను తలకు చుట్టుకుని, చెట్టు మొదలును నరికేందుకు గొడ్డలి పైకెత్తాడు.

ఇంతలో, "అగు! నా నివాసాన్ని కూల దొయ్యకు," అని చెట్టు పైనుంచి స్త్రీ కంఠస్వరంతో మాటలు వినవచ్చాయి. ఆ మరుక్షణం పైనుంచి ఒక యక్షిణి, వాళ్ళ ముందుకు దూకింది.

మురారీ, కూలివాడూ భయకంపితులై చూస్తూన్నంతలో యక్షిణి, "ఇది, నా నివాసం! ఎన్నో సంవత్సరాలుగా, ఎంతో హాయిగా ఈ చెట్టు పైన వుంటున్నాను. అసలు నువ్వీ చెట్టును ఎందుకు నరకజూస్తున్నావు?" అని అడిగింది.

యక్షిణి పెద్దగా కోపగించకుండా, కొంత శాంతంగా మాట్లాడడంతో మురారి తెప్పరిల్లి, కాస్త ధైర్యం తెచ్చుకుని, "రాకుమారికి నేను వీణ తయారుచేసి పంపాలి. అందుకవసరం అయిన చెట్టు, ఈ ప్రాంతాన మరెక్కడా లేదు. కాబట్టి, నేనీ చెట్టును నరికించక తప్పదు!" అన్నాడు.

ఈసారి యక్షిణి, మురారి కేసి కోపంగా చూస్తూ, "ముష్టి వీణ తయారీకి నేనున్న చెట్టే దొరికిందా?" అని చేతుల్ని ముందుకు చాచింది.

ఆ మరునిమిషం యక్షిణి చేతుల్లో, ఒక అద్భుతమైన వీణ ప్రత్యక్షమైంది. దానికి అక్కడక్కడా అమూల్యమైన వజ్రాలు తాపడం చేసి వున్నాయి.

మురారి ఆశ్చర్యపోతూ చూస్తూన్నంతలో, యక్షిణి, "ఇది మహిమ గల వీణ! సంగీతంలో సరిగమలు రానివాళ్ళు కూడా, ఈ వీణను అద్భుతంగా వాయించవచ్చు. వీణ

ముందు కూర్చుని సరస్వతీ దేవిని మనసారా స్మరించి, కావలసిన రాగం మనసులో అను కొని తీగలను సవరిస్తే చాలు, ఈ వీణ మీద ఆ రాగం పలుకుతుంది. అయితే, దీనిమీద రెండు రాగాలు మాత్రం బాగా ఆలోచించి వాయించాలి. మోహనరాగం వాయిస్తే, నువ్వు ఆ క్షణం మనసులో కోరు కున్న వ్యక్తి నిన్ను ప్రేమిస్తుంది. ఇక వరుణ రాగం వాయిస్తే, జడివాన కురుస్తుంది. అన్నిటికంటే ముఖ్యమైన విషయం — ఈ టేకుచెట్టు వున్నంత కాలమే నేనిక్కడుంటాను. నేనిక్కడున్నంత కాలమే, ఈ వీణలో మహిమ వుంటుంది. అర్థమైందా? ఇదుగో, వీణ తీసుకో!" అంటూ వీణను మురారికిచ్చి అంత ర్థానమైంది.

అనుకోకుండా తనకు మహిమ గల వీణ లభించినందుకు, మురారి ఉబ్బి తబ్బి బ్బయ్యాడు. ఆ అద్భుతమైన వీణ సాయంతో, తాను తలచుకుంటే రాకుమారి చారులతనే పెళ్ళాడగలడు!

మురారి ఇలాంటి ఊహలతో తేలిపో తూండగా, పక్కన వున్న కూలివాడు అతణ్ణి హెచ్చరిస్తూ, "అయ్యా! పొద్దు ఏటవాలింది. ఇక మనం ఇంటికి బయలుదేరుదామా?" అన్నాడు.

దానితో మురారి ఊహాలోకం నుంచి బయటపడి, కూలివాడితో, "సరే, బయలు దేరుదాం. ఒక సంగతి గుర్తుంచుకో. ఈ వీణ గురించి ఊళ్ళో ఎవరికీ చెప్పకు," అని హెచ్చరించాడు.





అయితే, కూలివాడు ఇల్లు చేరుతూనే, యక్షిణి వీణ గురించి తన భార్యకు చెప్పాడు. ఆ రహస్యం ఎవరికీ చెప్పవద్దని హెచ్చరించాడు కూడా. అయినా లాభం లేకపోయింది. రహస్యం కూలివాడి భార్య నుంచి ఈ నోటా ఆ నోటా పాకి, తెల్లవారేసరికి ఊరు ఊరంతా గుప్పుమంది.

మురారి ఉదయం నిద్ర లేచేసరికి, తిరణాలకు వచ్చినట్టు ఊళ్ళోని జనం అతడి ఇంటి ముందు మూగి వున్నారు. ఏం జరిగిందో మురారి వెంటనే ఊహించాడు. గుంపు గూడిన జనం, మురారిని మహిమ గల వీణను ఒకసారి వాయించమని ఒత్తిడి చెయ్యసాగారు.

అయితే, ఇలాంటి మహిమల మీద నమ్మకం లేనియువకుడొకడు జనంలోంచి, "ఇంకేం,మురారీ!మహిమగలవీణ వాయించి, సరాసరి మన రాకుమారి చారులత మెడలో తాళి కట్టెయ్యి. ఆ తర్వాత ఏకంగా, ఈ దేశానికే నువ్వు మహారాజువు కావొచ్చు!" అన్నాడు హేళనగా.

మురారికి వాడి వేళాకోళపు మాటలు కోపం తెప్పించాయి. దానితో, వాడి మాటలు నిజం చెయ్యాలనుకుంటూ, ఇంట్లోకి వెళ్ళి యక్షిణి ఇచ్చిన వీణను బయటికి తెచ్చాడు. తర్వాత ఇంటి ముంగిట అరుగు మీద పద్మాసనం వేసుకొని కూర్చుని, కాసేపు కళ్ళు మూసుకొని సరస్వతీ దేవిని ప్రార్థించాడు.

ప్రార్థన ముగియగానే మురారి వీణను శృతి చేసి, యువరాణి చారులత తనను ప్రేమించాలనుకుంటూ రాగాన్ని మనసులో మననం చేసుకుని, వీణ తీగల్ని మీటసాగాడు. జనం ఊపిరి బిగబట్టి, చెవులు రిక్కించి పరమానందంగా వీణానాదాన్ని వినసాగారు.

అయితే, ఉన్నట్టుండి వాతావరణంలో మార్పు రాసాగింది. ఆకాశంలో నల్లటి మేఘాలు అలముకోసాగాయి. అంతలోనే ఉరుములు, మెరుపులు! జనంతోపాటు మురారి కూడా ఉలిక్కిపడ్డాడు. ఆ మరు క్షణం అతడికి తను చేసిన పొరబాటు

తెలియ వచ్చింది. తను మోహనరాగానికి బదులు, వరుణరాగం మనసులో అనుకొని వీణను వాయించాడు. అందుకే జడివాన ప్రారంభమయింది. అయినా, ఇప్పుడు విచారించి ఏమి లాభం? అప్పటికే కుంభవృష్టిగా వాన ప్రారంభమైంది.

"గ్రీష్మ కాలంలో హఠాత్తుగా, ఈ జడివాన ఏమిటిరా, దేవుడా!" అని కేకలు వేస్తూ,జనమంతా పాలోమని తమ ఇళ్ళకేసి పరుగులు తీశారు.

ఇంతలో ఆకాశంలో కళ్ళు మిరమిట్లు గొలిపేలా, ఒక పెద్ద మెరుపు మెరిసింది. ఆ మరుక్షణం దూరంగా ఎక్కడో పిడుగుపడిన శబ్దం వినిపించింది. ఏదో ఆలోచనలో వున్న మురారి, తన మోచేతులకి ఏదో మెత్తగా తగలడంతో ఉలిక్కిపడి చూశాడు. అక్కడ వీణకు బదులు ఒక పెద్ద సర్పం ఉన్నది!

మురారి భయంతో ఒక వెర్రి కేక పెట్టి లేచి నిలుచున్నాడు. సర్పం తలెత్తి అతడికేసి ఒకసారి చూసి, జర్రున అరుగు కిందికి జారి, బాణ వేగంతో ఆకాశంలోకి దూసుకు పోయింది.

ఇంటి ముందు రేగిన కోలాహలానికి కారణం తెలుసుకునేందుకు బయటికి వచ్చిన రామావతారం, కొడుకును ప్రశ్నించి జరిగిందేమిటో విని, "ఒరే, మురారీ! నీ ప్రవర్తన మన వృత్తిధర్మానికే తీరని మచ్చ. ఈ అనుభవంతోనైనా బుద్ధెరిగి ప్రవర్తించు. లేనిపోని దురాశలకు పోయి నలుగురిలో నవ్వులపాలు కాకు. ఈరోజే వెళ్ళి మంచి టేకుకొయ్య తెచ్చి, రాకుమారికి వీణ తయారుచెయ్యి," అని సలహా ఇచ్చాడు.

టేకుకొయ్య కోసం పాలకొండలకు వెళ్ళిన మురారికి, అక్కడ యక్షిణి నివసించే టేకు మాను పిడుగుపాటుకు నిలువునా కాలిపోయి కనిపించింది!

ఆ తర్వాత మురారి కష్టపడి మంచి టేకుకొయ్యను సంపాయించి, నెల తిరక్కుండానే రాకుమారి చారులత కోరిన వీణను తయారుచేసి, కోటకు వెళ్ళి ఆమెకిచ్చాడు.



# వీరాధివీరుడు!

హేలాపురిపై అక్రమంగా దండెత్తిన మగధరాజు కృతకీర్తి చిత్తుగా ఓడి, వెనుదిరిగి పారిపోయాడు. తమ విజయానికి కారకులైన సైనికముఖ్యులనూ, అధికారులనూ హేలాపురి మహారాజు అనేక విధాల సత్కరించాడు.

వీరబాహుడనే సైనికుడు యుద్ధరంగంలో వీరవిహారం చేసి, వెయ్యిమందికి పైగా శత్రు సైనికుల కాళ్ళూ, చేతులూ నరికాడని ఒక వార్త పుట్టింది. ఇదివిన్న వాడి గ్రామస్థులు, వాణ్ణి పూలమాలలతో ముంచెత్తి, గ్రామం నాలుగు వీధులూ మేళతాళాలతో ఊరేగించసాగారు. ఆ సమయంలో వాడు ఆనందోత్సాహంలో మైమరిచి వుండగా, జనం లోంచి ఒకడు, "వీరబాహూ! నువ్వు ఆ శత్రు సైనికుల తలలు నరక్కుండా, కాళ్ళూ, చేతులూ మాత్రమే నరికి ఎందుకూరుకున్నావు?" అని అడిగాడు.

దానికి వీరబాహు మీసం మెలివేస్తూ, ఒకటి రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, చప్పున ఏదో గ్రహించినవాడిలా, "అవును, అలాంటి అవకాశం నాకు రాలేదు. వాళ్ళందరి తలలూ ముందే తెగనరికి వున్నాయి!" అన్నాడు.

— కోనే నాగవెంకట ఆంజనేయులు






[దళనాయకుడు నాగసింహుడి నాయకత్వంలో కొందరు సైనికులను ఉత్తుంగుడికి సముద్ర ప్రయాణంలో తోడుగా పంపడానికి నాగపురి రాజు నిర్ణయించాడు. సేనాధిపతి, ఉత్తుంగుడికి ఆరోజే రాజ్యం సరిహద్దు నుంచి వచ్చిన నాగసింహుణ్ణి పరిచయం చేశాడు. గూడెంలో తమ ఇంట దాచిన శతాబ్దిక పుష్పాలు కూడా కనిపించలేదని కాబూయీ విచారంతో రాజధానికి వచ్చాడు. కాబూయీ, సేనాధిపతీ రాజు దగ్గరికి వెళ్ళి సంగతి చెప్పారు. -తరవాత]

"శతాబ్దిక పుష్పాలు మీ ఇంట్లో వున్న సంగతి ఉత్తుంగుడు నాగసింహుడికి చెప్పాడు. అంటే వాటిని నాగసింహుడే అపహరించి ఉంటాడంటావా?" అని అడిగాడు సేనాధిపతి.

కాబూయీ కొంతసేపు మౌనంగా ఆలోచించి, "నాగసింహుడు ఒకవేళ కుట్ర చేయాలనుకున్నప్పటికీ, ఈ పుష్పాలు అతనికెలా ఉపయోగపడతాయో అర్థం కావటం లేదు, ప్రభూ!" అన్నాడు.

"నువ్వన్నది నిజమే. శతాబ్దిక పుష్పాలు లేకుండా ఉత్తుంగుడు బయలుదేరలేడు గనక, అవి దొరికేంతవరకు నువ్వు రాజధానిలోనే ఉండడం మంచిది," అన్నాడు సేనాధిపతి.

"అలాగే వుంటాను," అని చెప్పి కాబూయీ అక్కడినుంచి ఉత్తుంగుడి విడిదికి వెళ్ళాడు. వాళ్ళిద్దరూ ఆ పువ్వుల గురించి చాలాసేపు చర్చించి, బాగా రాత్రయ్యాక నిద్రకు ఉపక్రమించారు.



మరునాడు మధ్యాన్నం ఒక సైనికుడు వచ్చి, "కాబూయీా, నిన్ను చూడాలని ఇద్దరు యువతులు వచ్చారు," అన్నాడు.

కాబూయీా గది వెలుపలికి వచ్చి, అక్కడున్న ఇద్దరు యువతులలో ఒకామెను చూసి, "అమ్మా, చిత్రా నువ్వా! ఇప్పుడెందుకు వచ్చావు? అమ్మ క్షేమంగా ఉన్నది కదా?" అని అడిగాడు ఆతృతగా.

"అమ్మ క్షేమంగానే ఉన్నది నాన్నా!" అంటూ ఆమె తండ్రిని సమీపించి, "కనిపించకుండా పోయిన పువ్వులు దొరికాయి నాన్నా!" అన్నది మెల్లగా.

"శతాబ్దిక పుష్పాలు దొరికాయా? నిజంగానా!" అన్నాడు కాబూయీా నమ్మలేనట్టుగా.

"అవును నాన్నా, నిజం! మేము ఈరోజు ఉదయం ఎప్పటిలాగే సముద్ర తీరానికి వెళ్ళాము. అక్కడ ఉత్తుంగుడు వచ్చిన పడవ బోర్లించబడి కనిపించింది. దగ్గరికి వెళ్ళి చూస్తే లోపల శతాబ్దిక పుష్పాలు కట్టలు కట్టలుగా కనిపించాయి. పడవను సముద్ర జలాల కేసి లాగినట్టు ఇసుక మీద రెండు చారలు కూడా కనిపించాయి. బహుశా ఉత్తుంగుడే వెళ్ళడానికి ప్రయత్నించాడేమో అని మేము అనుకున్నాము," అన్నది చిత్ర. అప్పుడే అక్కడికి ఉత్తుంగుడు కూడా వచ్చాడు.

"లేదు చిత్రా! అతడు రాత్రి ఇక్కడే ఉన్నాడు. అది సరే, ఇప్పుడు ఆ పువ్వులు ఎక్కడున్నాయి?" అని అడిగాడు కాబూయీా.

"అక్కడే, సముద్ర తీరం దగ్గరి పడవలోనే ఉన్నాయి. ఈ సంతోషకరమైన సంగతి మీకు తెలియజేయడానికే నా స్నేహితురాలిని వెంటబెట్టుకుని వచ్చాను," అన్నది చిత్ర.

కాబూయీా ఆప్యాయంగా కూతురి భుజం మీద చేయివేసి, "చాలా సంతోషం, చిత్రా! మీరు ఇక్కడే ఉండండి, మేము వెళ్ళి సేనాధిపతికి ఈ సంగతి చెప్పి వస్తాము," అని ఉత్తుంగుడి కేసి తిరిగి, "రా, వెళదాం," అంటూ ముందుకు నడిచాడు.

ఉత్తుంగుడు, "శతాబ్దిక పుష్పాలు కనిపించాయా? మీకుమార్తె ఏమంటున్నది, కాబూయీా?" అని అడిగాడు అతని వెంట నడుస్తూ.



కాబూయియా, తన కుమార్తె చెప్పిన విషయా లన్నిటినీ ఉత్తుంగుడికి చెప్పాడు. శతాబ్దిక పుష్పాలు దొరికాయని తెలియగానే ఉత్తుం గుడు చాలా సంతోషించాడు. అయినా, ఆ పువ్వులను తీసుకుని తన పడవలో వెళ్లా లని ప్రయత్నించినవాడెవడై ఉంటాడు? నాగ సింహుడే అయితే, అతని ఉద్దేశం ఏమై వుంటుంది? ఇలా రకరకాలుగా ఆలోచిస్తూ, ఉత్తుంగుడూ, కాబూయియా సేనాధిపతి భవనం సమీపించారు. వాళ్ళను చూడగానే సేనాధిపతి, "ఏమయింది?" అని అడిగాడు. కాబూయియా సంగతి చెప్పాడు.

"శభాష్! ఆ శుభవార్తను తెచ్చిన సైనికులు ఎక్కడ?" అన్నాడు సేనాధిపతి.

"సైనికులు కాదు ప్రభూ. ఆ వార్తను నా కుమార్తె చిత్ర తీసుకువచ్చింది," అంటూ కాబూయియా అన్ని విషయాలూ వివరించాడు.

"అలాగా! చాలా సంతోషం. ఆ పుష్పాలకు రక్షణ ఏర్పాటు చేయాలి. ఇప్పుడే మన సైనికులను కొందరిని పంపుతాను. మొదట ఈ సంగతి రాజుకు తెలియజేద్దాం, పద," అంటూ అక్కడినుంచి బయలుదేరాడు.

వాళ్ళ నుంచి విషయం తెలుసుకున్న రాజు, "చాలా సంతోషం, సేనాధిపతీ! ఆ పుష్పాలను రాకాసిమృగం దగ్గిరికి చేర్చడానికి ఏమాత్రం ఆలస్యం చేయకూడదు, ఏమం టావు కాబూయియా?" అని ఉత్తుంగుడి వైపు తిరిగి, "ఎప్పుడు బయలుదేరతావు?" అని అడిగాడు.

"ఈ క్షణమే బయలుదేరమన్నా సిద్ధంగా ఉన్నాను, ప్రభూ!" అన్నాడు ఉత్తుంగుడు.

"శభాష్, ఉత్తుంగా!" అంటూ రాజు లేచి నిలబడి, ఉత్తుంగుడి భుజం మీద చేతులు వేసి, "నీవంటి సాహసవీరులే ఏ రాజ్యానికైనా నిజమైన సంపద వంటివారు! తిరుగు ప్రయా ణంలో మా రాజ్యానికి తప్పకుండా వచ్చి వెళ్ళు!" అని చెప్పి, సేనాధిపతికేసి తిరిగి, "ఈరోజే ఉత్తుంగుడి ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నిటినీ చూడు. నేను వెళ్ళి శతాబ్దిక పుష్పాలు దొరికిన సంగతి మల్లికకు చెబు తాను," అంటూ భవనం లోపలికి బయలు దేరాడు.

రాజభవనం నుంచి వెలుపలికి వచ్చిన సేనాధిపతి, నాగసింహుడి కోసం కబురు పంపాడు.

కొంతసేపటికి అక్కడికి వచ్చిన దళ నాయకుడు నాగసింహుడు — సేనాధిపతీ, కాబూయీ, ఉత్తుంగుడూ ఒకేచోట ఉండడం చూసిఒక్క క్షణం ఉలిక్కిపడ్డాడు. ఆ తరవాత తేరుకుని సేనాధిపతికి నమస్కరించాడు.

"ఈరోజే ఉత్తుంగుడి ప్రయాణం. నువ్వు మన సైనికులు కొందరితో అతనికి రక్షణగా వెళ్ళాలి. ఇది రాజాజ్ఞ!" అన్నాడు సేనాధిపతి.

"ఈ రోజేనా, సేనాధిపతీ! మరి పుష్పాలు లభించాయా?" అని అడిగాడు నాగసింహుడు అమితాశ్చర్యంతో.



"పుష్పాలా? ఆ సంగతి నీకెందుకు?" అని అడిగాడు సేనాధిపతి కటువుగా.

"మేము పుష్పాలు తీసుకువెళ్ళాలి కదా!" అని అడిగాడు నాగసింహుడు.

"అవును. వాటిని రాకాసిమృగం ఉన్న చోటికి చేర్చడానికే ఈ ప్రయాణం. ఈరోజు సాయంకాలానికి మీరు సముద్రతీరం చేరండి. బండల మధ్య దారిగుండా సముద్రంలో పడవలో బయలుదేరండి. మీకు వెనకగా రెండు పడవలలో మన సైనికులు వస్తారు. మిగతా విషయాలు ఉత్తుంగుడు చూసుకుంటాడు," అన్నాడు సేనాధిపతి.

"మరి, పుష్పాలు?" అంటూ ఏదో చెప్పబోయి ఆగాడు నాగసింహుడు.

"అన్నీ సిద్ధంగా ఉన్నాయని చెప్పాను కదా? నువ్వు బయలుదేరడమే తరువాయి," అన్నాడు సేనాధిపతి.

"చిత్తం, సేనాధిపతీ!" అని నాగసింహుడు అక్కడినుంచి విసురుగా వెళ్ళిపోయాడు.

ఆ తరవాత సేనాధిపతి, ఉత్తుంగుడితో, "పుష్పాలు దొంగిలించబడిన సంగతి నాగసింహుడికి తెలిసే వుంటుంది. అయినా, ఇప్పుడు విచారణకు సమయం కాదు. అతడు ఒంటరిగా రాకాసిమృగాన్ని ఎదుర్కోలేడు కనక, నీకు హాని తలపెట్టే అవకాశం లేదు. ఎందుకయినా నువ్వు నాగసింహుడి పట్ల జాగ్రత్తగా ఉండడం అవసరం!" అని చెప్పాడు.



"అలాగే!" అన్నాడు ఉత్తుంగుడు వినయంగా.

సేనాధిపతి, కాబూయితో, "నువ్వు ఉత్తుంగుడి వెంట సముద్ర తీరం వరకు వెళ్ళి, అతన్ని సాగనంపి రా," అన్నాడు.

"చిత్తం, సేనాధిపతీ!" అని కాబూయి ఉత్తుంగుణ్ణి వెంటబెట్టుకుని అక్కడినుంచి వాళ్ళు ఉంటున్న విడిదికి వెళ్ళాడు. వాళ్ళ కోసం ఎదురుచూస్తున్న చిత్రతో అన్ని సంగతులూ చెప్పాడు కాబూయి.

కొంతసేపటికి దళనాయకుడు నాగసింహుడు అక్కడికి వచ్చాడు. అందరూ సముద్ర తీరానికి బయలుదేరారు. నాగసింహుడు ఒక్క మాట కూడా మాట్లాడలేదు. అతని ముఖంలో తీరని విచారం, నిరుత్సాహం కనిపించాయి.

సైనికులు వాళ్ళను చూడగానే చేతులెత్తి దళనాయకుడికి నమస్కరిస్తూ ఆహ్వానించారు. అక్కడ మూడు పడవలు సిద్ధంగా ఉన్నాయి. ఒక పడవలో శతాబ్దిక పుష్పాలు ఉన్నాయి. అవి అప్పుడే పూచినట్లు కళ కళలాడుతూ కమ్మని వాసనలు వెదజల్లుతున్నాయి. పువ్వులున్న పడవ తాను వచ్చినదే అని ఉత్తుంగుడు గ్రహించాడు. అతడు తన నడుముకు కట్టుకున్న సంచీలో దాచిన శతాబ్దిక మొక్కలను తీసి, చిత్రకు ఇచ్చి, వాటిని వాళ్ళ ఇంటి దగ్గర నాటి పెంచమని చేతి సైగలతో తెలియజేశాడు.

మొక్కలను తీసుకున్న చిత్ర, ఉత్తుంగుడికేసి విచారంగా చూడసాగింది.

శతాబ్దికపుష్పాలను చూడగానే, నాగసింహుడిలో ఎక్కడలేని ఉత్సాహం పుట్టుకు వచ్చింది. ఉత్తుంగుడు ఎందుకు ఆలస్యం చేస్తున్నాడన్న భావంతో అతనికేసి చూడసాగాడు. దానిని గ్రహించిన కాబూయి, "ఉత్తుంగా, చీకటి పడకముందే బయలుదేరడం మంచిది. నేను చెప్పిన విషయం గుర్తుంచుకో. నీ రాక కోసం మేము ఎదురు చూస్తుంటాము," అంటూ చేయెత్తి వీడ్కోలు చెప్పాడు.

ఉత్తుంగుడు అతనికి నమస్కరించి, పడవకేసి నడిచాడు. ఆలోగానే నాగసింహుడు పడ

వలో కూర్చుని ఉన్నాడు. సైనికులు పడవను నీళ్ళలోకి తోశారు. ఉత్తుంగుడు అందులోకి ఎక్కి కూర్చుని తెడ్లను అందుకున్నాడు. ఆ పడవ వెనక సైనికులతో రెండు పడవలు బయలుదేరాయి.

ఉవ్వెత్తున లేచిన ఒక అల మూడు పడవలనూ లోతైన సముద్ర జలంలోకి తీసుకువెళ్ళింది. అప్పుడే సూర్యాస్తమయం అవుతున్నది. అర్ధరాత్రి కల్లా సముద్ర మధ్యాన్ని చేరుకోవాలన్న ఉత్సాహంతో ఉత్తుంగుడు పడవను నడపసాగాడు. వెనక రెండు పడవలలో సైనికులు కొద్ది దూరంలో అతన్ని అనుసరించి రాసాగారు.

"ఈ పువ్వులను తీసుకుపోయి, రాకాసి మృగం ఉన్నచోట చేర్చినంత మాత్రాన అది మాణిక్యపురికి రాదని నీకెలా తెలుసు?" అన్న మాటలు కఠినస్వరంతో వినిపించడంతో ఉత్తుంగుడు తల పైకెత్తి చూశాడు.

నాగసింహుడు కోపంగా చూస్తున్నాడు.

"ఈ పువ్వుల చేత ఆకర్షించబడే రాకాసి మృగం మాణిక్యపురికి వచ్చింది. ఇప్పుడు మాణిక్యపురిలో ఒక్క శతాబ్దిక పుష్పం కూడా లేకుండా చేశాం. అన్నిటినీ కట్టగట్టుకుని తీసుకుని వచ్చాను. మరొక వంద సంవత్సరాలు ఆ పువ్వులు పూచే అవకాశం లేదు. కాబట్టి రాకాసిమృగం అంతవరకు మాణిక్య పురికి వచ్చే అపాయం లేదనే పెద్దలు చెప్పారు!" అన్నాడు ఉత్తుంగుడు.



"అంటే, ఈ పువ్వులను చూపి రాకాసి మృగంతో బేరం కుదుర్చుకోవచ్చునన్న మాట! అంతేనా?" అన్నాడు నాగసింహుడు.

"రాకాసిమృగంతో బేరమా! ఏమిటి నువ్వంటున్నది? దానిని సమీపించి మాట్లాడడం ఎలా సాధ్యం? దానికి మన భాష అర్థమవుతుందా? ఇంతకూ నీకు రాకాసిమృగంతో ఏమిటి పని?" అని అడిగాడు ఉత్తుంగుడు ఆశ్చర్యంగా.

"చాలా ముఖ్యమైన పనే ఉన్నది! రాజభవనాన్నీ, అందులోని రాజునూ, రాణినీ, యువరాణినీ నేలమట్టం చెయ్యాలి. అందుకు నాకు రాకాసి మృగం సహాయం కావాలి!" అన్నాడు నాగసింహుడు.

ఉత్తుంగుడికి మరొక భయంకర మృగంతో మాట్లాడుతున్నట్టనిపించింది. అసలు రాకాసి మృగం పువ్వుల కోసం బీభత్సం సృష్టిస్తే, నాగసింహుడు స్వార్థంతో అంతకన్నా క్రూర రాక్షసుడుగా మాట్లాడుతున్నాడు!

"మంచివాళ్ళూ, నీకు బంధువులూ అయిన వాళ్ళను ఎందుకు నాశనం చేయాలి?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"నేను నాగపురికి రాజును కావాలి. దానికి అడ్డుపడేవాళ్ళు ఎవరయినా సరే హతమారుస్తాను. నా తోబుట్టువులు, బంధువులు, ఆప్తులు అనే దయాదాక్షిణ్యాలు పాటించను. ఆఖరికి నువ్వు అడ్డుపడినా సరే హతమార్చి తీరుతాను," అన్నాడు నాగసింహుడు పిడికిలి బిగిస్తూ.

"నన్ను హతమారుస్తావా? మాణిక్యపురి నుంచి తెచ్చిన పువ్వులు నీకు ఉపయోగపడడానికి అనుమతించను. వాటి ద్వారా రాజ కుటుంబానికి హాని జరగడానికి ఒప్పుకోను!" అన్నాడు ఉత్తుంగుడు దృఢమైన కంఠస్వరంతో.

"నువ్వు ప్రాణాలతో ఉంటే కదా ఒప్పుకోకపోవడానికి?" అంటూ నాగసింహుడు లేచి, ఉత్తుంగుణ్ణి తెడ్డుతో ఒక్క తోపు తోశాడు. ఉత్తుంగుడు వెల్లకిలా సముద్రంలోకి పడిపోయాడు. తరవాత అతని జాడ తెలియ లేదు. నాగసింహుడు కొంతసేపు చుట్టుపక్కల కలయ చూసి, తన పడవను సైనికులు వస్తూన్న పడవలకేసి నడిపించి, తన పడవలోని శతాబ్దిక పుష్పాలను ఆ పడవలలోకి మార్చుకుని తనూ అందులోకి వెళ్ళాడు.

సముద్రంలో పడిన ఉత్తుంగుడు నెమ్మదిగా ఈదుతూ వుండి, కొంతసేపటికి తల ఎత్తి చూశాడు. చీకటి అలముకుంటున్నది. ఉన్నట్టుండి అతని చేతికేదో తగిలింది. అతడు దానిని పరిశీలించి చూశాడు. అదొక ఖాళీ పడవ. అతడు అతి ప్రయత్నం మీద ఆ పడవలోకి ఎక్కి కూర్చున్నాడు. అదృష్టవశాత్తు అందులో రెండు తెడ్లు ఉన్నాయి. ఒకవైపున అతనికి దూరంగా ఎత్తయిన బండలు కనిపించాయి. శతాబ్దిక పుష్పాలు లేకుండా రాకాసి మృగాన్ని ఎదుర్కోవడం వల్ల ప్రయోజనం లేదు కాబట్టి, పడవను బండలు కనిపిస్తున్న తీరంకేసి నడపసాగాడు. — (ఇంకావుంది)






# రంగనాథుడి ఆశయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటిలో, నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే జాలి కలుగుతున్నది. అయితే, ఇంత శ్రమకు గురవుతూ నువ్వు సాధించదలచిన కార్యం, నీ స్వార్థానికా లేక పరులకోసమా అన్న సంగతి తెలియడం లేదు. ఎందుకంటే, ఒక్కొక్కసారి నిస్వార్థబుద్ధులైన వ్యక్తులు, గొప్పవారికోసమే గాక, అనాలోచితంగా అల్పుల కోసం కూడా త్యాగాలు చేసేందుకు సిద్ధమవుతారు. ఇందుకు పెద్దగా ఆ వ్యక్తులను తప్పు పట్టనవసరంలేదు. కారణం — పరిస్థితుల ప్రభావంవల్ల, అల్పబుద్ధులైన వాళ్ళు కొన్ని సమయాల్లో ఎంతో నీతివంతంగా ప్రవర్తిస్తారు. ఇందుకు ఉదాహరణగా రంగ

## బేతాళ కథలు



నాథుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

రాయవరం గ్రామంలో రంగనాథుడు పెద్ద భూస్వామి. ఆయన రోజూ తన చుట్టూ చేరిన వారికి ఎన్నో కబుర్లూ, కథలూ చెబుతూండేవాడు. వినడానికవి ఇంపుగా వుండడంవల్ల, చాలా మంది రోజూ సాయంత్రం ఆయన ఇంటి అరుగుల మీద చేరేవారు.

రంగనాథుడు ఒకరికి సాయపడే మనిషి కాదు. ఆయన తన కబుర్లలో, "ఎదుటివాడికి హాని చేయడం ఎంత తప్పో మేలు చేయడమూ అంతే తప్పు. ఎవడి బ్రతుకు వాడు బ్రతకడంలోనే మనిషికీ, ప్రపంచానికీ ఎంతో మేలుంది," అని చెబుతూండేవాడు.

ఈ మాటలు వినడంవల్ల క్రమంగా రాయవరం గ్రామస్థుల్లో ఉపకారబుద్ధి నశించి పోసాగింది.

ఇలా వుండగా, ఆ గ్రామానికి సాధువొకడు వచ్చి, "ఎదుటివాడి కోసం బ్రతకడంలోనే మనిషి గొప్పతనముంది. అలాంటి మనిషి ఈలోకంలో సుఖపడడమే కాక, ప్రాణం పోయాక స్వర్గానికి వెళ్ళి అక్కడా సుఖపడతాడు," అంటూ నీతి బోధలు చేసి, కొన్ని ఉదాహరణలు కూడా చెప్పి వెళ్ళాడు.

ఆయన ప్రభావం గ్రామస్థుల మీద బాగా పడింది. చాలామంది పుణ్యకార్యాలు చేయాలనుకున్నారు.

ఆ గ్రామంలో వీరన్న అనే యువకుడున్నాడు. చిన్నతనంలో ఇల్లు కూలి వాడి తల్లిదండ్రులు మరణించారు. వాడికాలొకటి దెబ్బతిని కుంటివాడైపోయాడు. ఏ పనీ చేయలేక వాడు అడుక్కుని తింటూ అతికష్టం మీద రోజులు గడుపుతున్నాడు. ఇప్పుడు వీరన్నకు దూరపు బంధువైన ధర్మన్న, వాడిని తన ఇంట్లో వుంచుకుని పోషించాలనుకుని, ఆ విషయం ముందుగా రంగనాథుడి చెవిని వేశాడు.

"ఇంట్లో వుంచుకుని పోషిస్తే వీరన్న సోమరిగా తయారవుతాడు. ఏదో విధంగా తన పొట్ట తాను పోషించుకుంటున్న వీరన్న, ఇతరుల మీద ఆధారపడకుండా చేయాలంటే, నా దగ్గరకు పంపు. మా ఇంట్లో వుంటాడు.

నేను వాడికి వెదురుబుట్టలు, తడికలు అల్లడంనేర్పిస్తాను. మన గ్రామం వాళ్ళందరూ వెదురు సరుకు వాడి దగ్గిరే కొనుక్కోవాలి. ఇంకా మిగిలిపోయిన సరుకు పట్నంలో అమ్మి పెట్టాలి. సాయమంటే అలావుండాలి!" అన్నాడు రంగనాథుడు.

ధర్మన్నకిది ఎంతో నచ్చి అలాగే ఏర్పాటు చేశాడు. రంగనాథుడి భార్య మాత్రం వీరన్నను ఉచితంగా పోషించాలని గింజుకుంటూంటే ఆయన ఓదార్చి, "వెర్రిదానా! వెదురు సరుకు వ్యాపారం ఎంత లాభసాటిగా వుంటుందో నీకు తెలియదు. గ్రామం వాళ్ళంతా సరుకు మనదగ్గిరే కొంటారు. అందువల్ల అమ్మకం కూడా పెద్ద సమస్య కాదు. వీరన్నకు రోజూ మూడు పూటల తిండి ఖర్చు పోగా, వాడికి కొంత డబ్బిచ్చినా, ఇంకా మనకు లాభం వుంటుంది!" అని చెప్పాడు.

ఇది నిజమని ఋజువు కావడంతో ఆమె సంతోషించింది. రంగనాథుడికి బాగా పేరూ వచ్చింది.

ఆ తర్వాత సుధాముడనే వాడు గ్రామంలో వేంకటేశ్వరస్వామికి గుడి కట్టించాలనుకున్నాడు. రంగనాథుడు అతడికి సలహా చెబుతూ, "గ్రామంలో ఇప్పటికే రామాలయ ముంది. అది పాడుబడి వుంది. మీకందరికీ అంత భక్తిగా వుంటే, ఆ ఆలయాన్ని నేనే బాగు చేయిస్తాను. శ్రీరాముడైనా, వేంకటేశ్వరుడైనా అందరూ మహావిష్ణువు ప్రతిరూపాలే! అయినా ఆలయం ఆవరణలో శ్రీవేంకటేశ్వరునికీ ఒక మందిరం నిర్మిస్తాను. భక్తులు క్రమం తప్ప



కొండంత ఆస్తి. నాకెవ్వరూ లేరు. ఉన్నదంతా పేదలకిచ్చి వాళ్ళ జీవితాలు బాగుచేయాలని, ఊరూరూ తిరుగుతున్నాను. మీ ఊళ్ళో పేద వాళ్ళెందరున్నారో అందరినీ పిలవండి. వాళ్ళకు పొలాలు కొని పెడతాను. పొలం వద్దన్న వాళ్ళకు మరేదైనా ఉపాధి కల్పిస్తాను," అన్నాడు.

గ్రామపెద్దలిందుకు ఎంతో సంతోషించి, రంగనాథుడికి కబురంపి విషయం చెప్పారు. రంగనాథుడు కోపంగా,"మా గ్రామంలో దానాలు పుచ్చుకునే పేదవారు ఎవరూ లేరు. అందరూ స్వయంకృషితో డబ్బుసంపాదించుకుని, ఉన్న దానితో తృప్తిగా జీవిస్తున్నారు," అన్నాడు.

రంగనాథుడు ఆ గ్రామంలో చేసిన ఏర్పాట్లన్నీతెలుసుకున్న అంబరుడు,"నువ్వు సామాన్యుడివి కాదు! నా ఆస్తిని కూడా నువ్వే తీసుకుని సద్వినియోగం చెయ్యి. నేను హిమాలయాలకు వెళ్ళిపోతాను," అన్నాడు.

ఈ మాటలకు రంగనాథుడు మండిపడి, "నువ్వు హిమాలయాలకు వెళ్ళదల్చుకుంటే, నీ ఆస్తిని ఈ దేశపురాజు కిచ్చి వెళ్ళు. నేను పేదవాళ్ళను స్వయంకృషితో అభివృద్ధికి వచ్చేలాగాచేస్తాను. దానాలు స్వీకరించడం నా జీవితాశయానికి విరుద్ధం. అదీకాక, ఇంతవరకూ ఏ సత్కార్యాలూ చేయకుండా నీ వద్ద అంత డబ్బు చేరిందంటే, అది అన్యాయార్జితమై వుండాలి. అది నువ్వు రాజుకివ్వడం ద్వారా, ప్రజలసొమ్ము ప్రజాధిపతికే చేరి నీ తప్పులు క్షాళనమైపోగలవు!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రంగనాథుడు అల్పబుద్ధి, స్వలాభపరుడు. స్వయం



కృషి పేరు చెప్పి, పేదవాళ్ళ ఆదాయంలో కొంత భాగం సొంతం చేసుకుంటున్నాడు. అలాగే గుడి, బడి విషయంలో కూడా. అయినా అతడు, అంబరుడిస్తానన్న కొండంత ఆస్తిని తీసుకో నిరాకరించడం అంటే, అందుకు కారణం అతడి బుద్ధిలో, ఆలోచనా ధోరణిలో, ఒక్కమాటలో చెప్పాలంటే, అతడి నైజగుణంలోనే నీతివంతమైన గొప్ప పరిణామం వచ్చిందనడానికి నిదర్శనం కదా? ఇందుకు మూల కారణం ఏమై వుంటుంది? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అల్పుడూ, స్వార్థ పరుడూ అయిన రంగనాథుడు, అంబరుడిస్తానన్న ఆస్తిని నిరాకరించినంత మాత్రాన, నీతి పరుడయ్యాడనుకోవడం పెద్ద పొరబాటు. రంగనాథుడి ప్రవర్తనను సూక్ష్మంగా పరిశీలించినప్పుడే, అతడి జీవితాశయం ఏమిటో అర్థమవుతుంది. అతడు మంచిపనులు చేయలేడు. ఇతరులు చేసే మంచిపనులకు సహకరించలేడు. స్వలాభం లేనిదే ఎవరికీ ఉపకారం చేయడు. అలాగని, ఈ లక్షణాల వల్ల చెడ్డపేరు వస్తే భరించలేడు. ఆ కారణం వల్లనే, మంచిపనులు చేయదలచిన వాళ్ళను, ఆ పనులు చేయకుండా ఆపుతున్నాడు. అలాంటి వాళ్ళ మంచిలో చెడు వుందని ఋజువు చెయ్యడానికి, తన తెలివితేటలను ఉపయోగిస్తున్నాడు. అంబరుడి విషయంలో కూడా అతడి ప్రవర్తనలో మార్పులేదు. వాడి ఆస్తిని అన్యాయార్జితమన్నాడు. దానిని రాజుకిచ్చి, చేసిన తప్పులు క్షాళనం చేసుకోమన్నాడు. అంటే — అంబరుడు చేయదలచిన మంచి పనులను, అందరికీ చెడుగా చూపి, తన పేరు ప్రఖ్యాతుల్ని కాపాడుకోవడం, రంగనాథుడి ఆశయం! ఈ కారణాల వల్ల, అతడి నైజగుణంలో నీతివంతమైన గొప్ప పరిణామం వచ్చిందనుకోవడం పెద్ద పొరబాటవుతుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : "జొన్నలగడ్డ రామలక్ష్మి" రచన]






గంగయ్య, రైతుల నుంచి ధాన్యం కొనుగోలు చేసి, ఆ ధాన్యాన్ని పట్టణంలో వుండే పెద్ద వ్యాపారులకు తిరిగి అమ్మే వ్యాపారి. ఆయనకు ఒక్కడే కొడుకు; వాడి పేరు సుందరం. వాడికి ఎంత ప్రయత్నించినా పెద్ద చదువులు వంటపట్టవని గ్రహించిన తర్వాత గంగయ్య, తను వ్యాపార పనులపై తిరిగేటప్పుడు సుందరాన్ని కూడా వెంట తీసుకువెళుతూ, వాడికి వ్యాపారంలోని మెళుకువలు నేర్పాలని నిర్ణయించుకున్నాడు.

ఒకనాటి ఉదయం గంగయ్య, సుందరాన్ని పిలిచి, "పొన్నపల్లి గ్రామంలో పున్నయ్య ధాన్యం అమ్మచూపుతున్నాడని తెలిసింది. ముందు నువ్వువెళ్ళి సరుకు నాణ్యత చూసిరా. ఆ తర్వాత ఇద్దరం మళ్ళీ వెళ్ళి ధాన్యాన్ని చూసి, ధర కుదిరితే కొనుగోలు చేద్దాం. ఈవిధంగా నీకు క్రమంగా వ్యాపారంలోని మెళుకువలు తెలుస్తాయి,"అని చెప్పాడు.

అయితే, ఆరోజు ఉదయాన్నే బయలుదేరి పొన్నపల్లి వెళ్ళిన సుందరం, చీకటి పడుతూండగా ఇంటికి తిరిగివచ్చాడు.

గంగయ్య, కొడుకును, "వెళ్ళి రావడానికి ఇంత ఆలస్యం అయిందేమిటి?" అని అడిగాడు. దానికి సుందరం విసుగ్గా, "సరుకు నాణ్యత చూసి రమ్మన్నావు కదా! ఆ పున్నయ్య వంద బస్తాల ధాన్యం అమ్మజూపుతున్నాడు. ప్రతి బస్తాలోని ధాన్యం పరీక్షించి చూడడానికి ఇంత సమయం పట్టింది! సరుకు నాణ్యంగానే కనబడుతున్నది," అని జవాబిచ్చాడు.

కొడుకు జవాబు విని గంగయ్య నవ్వి, "ఒరే! అన్నం ఉడికిందో లేదో తెలియాలంటే, అన్నం మొత్తం పట్టి చూడక్కర్లేదు, ఒక్క మెతుకు పట్టి చూస్తే చాలు. అలాగే, వంద బస్తాల సరుకు నాణ్యత తెలుసుకోవడానికి, వంద బస్తాలూ పరిశీలించి చూడక్కర్లేదు. అక్కడొకటి, ఇక్కడొకటిగా నాలుగైదు బస్తాల

వారణాశి శ్రీరామక్రిష్ణ

నుంచి చారెడు, చారెడు ధాన్యం మచ్చుతీసి చూస్తేచాలు.అప్పుడుమొత్తంసరుకునాణ్యత తెలిసిపోతుంది. అర్థమైందా?" అన్నాడు.

"ఓ౹, అర్థమైంది!" అంటూ సుందరం తల ఊపాడు.

మర్నాటి ఉదయం నిద్ర లేస్తూనే గంగయ్య ఏదో పనిమీద పొరుగూరు వెళ్ళి, సాయంకాలా నికి ఇల్లు చేరాడు.

తిరిగివచ్చిన తండ్రితో సుందరం, "నాన్నా! మనవద్ద ధాన్యం కొనుగోలు చేసిన నాగయ్య పట్టణం నుంచి వచ్చి, తను ఇవ్వవలసిన బాకీ తాలుకు ఇరవై వేల రూపాయలు జమ చేసి, రసీదు తీసుకువెళ్ళాడు. డబ్బును ఇన ప్పెట్టెలో భద్రంచేశాను," అని చెప్పాడు.

"అలాగా! ఆ నాగయ్య బాకీ చాలాకాలంగా వసూలు కాకుండా వున్నది. రేపు నేను ఆ బాకీ వసూలుపనిమీదే పట్నం వెళదామను కుంటున్నాను. ఆ శ్రమ తప్పింది. పోతే, ఆ నాగయ్య ఒట్టి నక్కజిత్తులమారివాడు. ఇచ్చిన డబ్బు సరిగ్గా లెక్క వేశావా? తేడా ఏం లేదు కదా?" అని అడిగాడు.

అందుకు సుందరం ధీమాగా, "తేడా అంటూ ఏమీ లేదు. ఆ నాగయ్య ఇరవై వేల రూపాయలను, వెయ్యికి ఒక సంచిగా ఇరవై సంచుల్లో ఇచ్చాడు. నిన్న నువ్వు చెప్పిన ప్రకారం, అన్ని సంచుల్లోని డబ్బూ లెక్కపెట్టి చూడనవసరం లేదు కదా, మచ్చుకు రెండు, మూడు సంచులు చూస్తే చాలు! ఆ పనే చేశాను. లెక్క సరిగ్గా వున్నది. అందువల్ల, నాగయ్య బాకీకి చెల్లు రసీదు ఇచ్చి, డబ్బు ఇనప్పెట్టిలో దాచాను," అన్నాడు.

ఇదివింటూనే గంగయ్య కంగారుపడుతూ, డబ్బు సంచులన్నిటినీ ఇనప్పెట్టెలో నుంచి బయటికి తీసి లెక్కవేసి, రెండు వేల రూపా యలు తగ్గినట్లు తెలుసుకుని, సుందరంకేసి ఒకసారి గుడ్లురుముతూ చూసి గొల్లుమన్నాడు.

తండ్రికి తనపై కోపం వచ్చిందని గ్రహిం చిన సుందరం, ఇంట్లోంచి బయటికి పోతూ, "ఈ పెద్దవాళ్ళున్నారే, బహు విచిత్రమైన మను షులు! వాళ్ళు చెప్పేది ఒకటి, చేసేది ఒకటి. చెప్పినట్టే చేసినా, కోపాలూ, తాపాలూ, ఛీ!" అనుకున్నాడు.



<u>మనదేశపు పక్షులు - జంతువులు:</u>

# అరుదైన తెల్ల పులులు



రేవా తెల్లపులుల గురించి ఎవరైనా ప్రస్తావించినప్పుడు వాటికి సంబంధించిన కథ కూడా గుర్తుకు వస్తుంది. దాదాపు నలభై సంవత్సరాలక్రితం అంటే 1951వ సం॥ మే 26వ తేదీ ఈ యథార్థ సంఘటన జరిగింది. రేవా మహారాజు అతిథుల కోసం 'దేవా' అడవులలో వేట ఏర్పాటు చేశాడు. వేటాడేవాళ్ళకు నాలుగు పిల్లలతో ఒక ఆడపులి ఎదురుపడింది. తల్లిపులీ మూడుపిల్లలూ తుపాకీ గుళ్ళకు బలి అయ్యాయి. ఒక తెల్లపిల్ల మాత్రం తప్పించుకుని పారిపోయింది. అయితే, మరునాడే దానిని ఆ పరిసరాలలో వెతికి పట్టుకుని గోవిందఘడ్ వేసవి భవనానికి తీసుకుపోయారు. ఆ రోజు రాత్రి అది అక్కడి నుంచి తప్పించుకున్నది కాని, తెల్లవారగానే పట్టుబడింది. తొమ్మిది నెలలు నిండిన ఆ పులిపిల్లకు 'మోహన్' అని పేరు పెట్టారు. ఆ తరవాత దానికీ 'బేగం' అనే ఆడపులికీ పది పిల్లలు కలిగాయి. అయితే, వాటిలో ఏ ఒక్కటీ తెల్లగా లేదు. ఆ తరవాత 'మోహన్'కూ 'రాధ' అనే మామూలు ఆడపులికీ జతకలిపారు. నాలుగు పిల్లలు పుట్టాయి. నాలుగూ తెల్లవే. 1958వ సం॥ అక్టోబర్ 30వ తేదీ ఇది జరిగింది. ఆ విధంగా 'మోహన్' అనే తెల్ల పులి ఈనాడు మన దేశంలోనూ ఇతర దేశాలలోనూ ఉన్న తెల్లపులులకు మూలం అయింది!

1990వ సం॥ జనవరి నాటికి మనదేశంలోని 10 జంతు ప్రదర్శనశాలలలో 16 మగ తెల్లపులులూ, 23 ఆడ పులులూ; విదేశాలలోని 8 జంతు ప్రదర్శనశాలలలో 47 మగ పులులూ, 37 ఆడపులులూ 10 పులిపిల్లలూ అంటే మొత్తం మీద 133 తెల్లపులులు ఉన్నాయి. ఇది నాలుగేళ్ళ నాటి మాట.

మామూలు పులుల శరీరం ముదురు నారింజ రంగు - బంగారు పసుపు రంగుతో ఉంటుంది. ఒంటినిండా నల్లటి చారలు ఉంటాయి. దవడలు, మెడ, కడుపు అడుగు భాగం తెల్లగా ఉంటుంది. తెల్లపులుల శరీరం తెల్ల గానూ, శరీరం మీద బూడిద రంగు చారలూ ఉంటాయి. కళ్ళు నీలిరంగుతో ఉంటాయి. తెల్లపులులు మామూలు పులుల కన్నా కొంత పెద్దవి. అయితే, వీటి అలవాట్లలో, స్వభావంలో మాత్రం ఎటువంటి తేడా కనిపించదు.

అక్బర్ ఆస్థానంలోని 'నవరత్నాల'లలో ఒకడైన అబుల్‌ఫజల్ 1561వ సం॥లో రచించిన 'అక్బర్‌నామా' గ్రంథంలో, తెల్లపులిని చిత్రించడం విశేషం. అరుదైన ఈ జంతువు పేరు మొట్టమొదట 'అక్బర్‌నామా'లో ప్రస్తావించబడింది.




# రామ్‌కింకర్



విశ్వకవి రవీంద్రనాథటాగూర్ స్థాపించిన శాంతినికేతన్‌లోని కళాభవన్‌ను నిర్వహిస్తూన్న సుప్రసిద్ధ చిత్రకారుడు నందలాల్ బోస్ దగ్గరికి 1925 వసం॥లో ఒక కుర్రవాణ్ణి తీసుకువచ్చారు. అతని పేరు రామ్‌కింకర్.

"నువ్వు గీసిన చిత్రాలేవైనా ఉన్నాయా?" అని అడిగాడు నందలాల్ బోస్.

"ఉన్నాయి,"అంటూ రామ్‌కింకర్ నలిగిపోయిన నలభై పేజీల నోటు పుస్తకం నిండా తాను గీసిన చిత్రాలను తీసి సంకోచంతో ఆయన ముందుంచాడు.



నందలాల్ బోస్ వాటిని చూసి, చిరునవ్వుతో తల ఊపి, రామ్‌కింకర్‌ను కళాభవన్‌లో విద్యార్థిగా చేర్చుకున్నాడు.

రామ్‌కింకర్ సామర్థ్యాన్ని అంతకు ముందే 'మోడర్న్ రెవ్యూ' సంపాదకుడు రామానంద ఛటర్జీ కనుగొన్నాడు. ఆయనే రామ్‌కింకర్‌ను శాంతినికేతన్‌కు పంపాడు. శ్రేయోభిలాషులు తనపై ఉంచిన నమ్మకాన్ని రామ్‌కింకర్ అచిరకాలంలోనే రుజువు చేశాడు.

అతడు అద్భుతమైన తన కల్పనా శక్తితో ఉపాధ్యాయుల, మిత్రుల అభిమానాన్ని చూరగొన్నాడు.



రామ్‌కింకర్ కళాభవన్‌లో ప్రాక్, పశ్చిమ చిత్ర కళా సంప్రదాయాలను క్షుణ్ణంగా అభ్యసించి, తనకంటూ ఒక విలక్షణమైన బాణీని అభివృద్ధి చేసుకున్నాడు. ముఖ్యంగా భారతీయ చిత్రకళలో నైరూప్య శైలిని ప్రవేశపెట్టి దానికి మార్గదర్శకుడయ్యాడు.

చిత్రాలను ఉన్నది ఉన్నట్టు చిత్రించకుండా – చిత్రభావాన్ని మరింత స్పష్టంగా, మరింత గాఢంగా, ప్రతీకాత్మకంగా చిత్రించడాన్ని నైరూప్యశైలి అంటారు. ఉదాహరణకు ఒక మేధావిని, శరీరానికి మించిన తల గల వ్యక్తిగా చిత్రించ వచ్చు.

రామ్‌కింకర్ చిత్రాలు చాలా శక్తివంతమైనవి. ఆయన చిత్రాలు కదులుతున్నట్టు కనిపిస్తాయి. ప్రకృతిదృశ్యాలు, పక్షులు, జంతువులు, మనుషులు, అద్భుత ప్రాణులు (ఢిల్లీ రిజర్వ్ బ్యాంక్ ఎదుట రామ్‌కింకర్ రూపొందించిన రెండు యక్షుల శిల్పాలు ఉన్నాయి.) మొదలైన వివిధ చిత్రాలను ఆయన చిత్రించాడు.

రామ్‌కింకర్ చాలా నిరాడంబరజీవి. విద్యార్థులు, కళాభిమానులు, విమర్శకులు ఆయనను ఎంతగానో గౌరవించినప్పటికీ ఆయనలో గర్వం అన్నది పొడసూపలేదు.

1976వ సం॥లో విశ్వభారతి ఆయనను ప్రత్యేక బిరుదుతో సత్కరించింది. వివిధ రంగాలకు చెందిన ప్రముఖుల నుంచి ఆయనకు ప్రశంసలు లభించాయి. 1980వ సం॥లో ఆయన తన 70వ యేట మరణించాడు.

# మీకు తెలుసా?

1. మన దేశానికి స్వతంత్రం ఇవ్వాలని ఇంగ్లాండు నిర్ణయించినప్పుడు మనదేశంలో వైస్రాయ్ ఎవరు?
2. ప్రపంచంలో పంచదార ఎక్కువగా ఉత్పత్తి చేసే దేశం ఏది?
3. కాళిదాసుకు సమకాలికుడైన రాజు ఎవరు?
4. ఏ దేశం ద్రవ్యాన్ని 'లీరా' అని అంటారు?
5. 'బుద్ధచరిత్ర' గ్రంథకర్త ఎవరు?
6. 'సేఫ్టీపిన్'ను కనుగొన్న వారెవరు?
7. మనదేశంలో అడవులు ఎక్కువగా ఉన్న రాష్ట్రం ఏది?
8. 'గులాబీలోయ' ఏ దేశంలో ఉన్నది?
9. మనదేశంలో తటాకం మధ్యలో ఉన్న జాతీయ ఉద్యానవనం ఏది?
10. ప్రపంచంలోకెల్లా చాలా పెద్ద ఎడారి ఏది?
11. మనదేశంలో 'రేషన్' పద్ధతి ఎప్పుడు ప్రవేశపెట్టారు?
12. 'జయశంకర్ ప్రసాద్' రచించిన సుప్రసిద్ధ కావ్యం ఏది?
13. ప్రపంచంలో అతిచల్లని శీతాకాలం ఎక్కడ వస్తుంది?
14. మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, దక్షిణ ఆఫ్రికా నుంచి మన దేశానికి ఏ సంవత్సరంలో తిరిగి వచ్చారు?
15. 'ఇండొనేసియా' రిపబ్లిక్ స్థాపకుడు ఎవరు?
16. 'మొహెంజదారో' అంటే అర్థం ఏమిటో తెలుసా?
17. లవంగాలు, మిరియాలు ఎక్కువగా పండే రాష్ట్రం ఏది?
18. 'వింబుల్డన్ ఛాంపియన్‌షిప్స్' ఎప్పుడు మొదలయ్యాయి?
19. మనదేశం చెస్ ఛాంపియన్ ఎవరు?
20. 'వందేమాతరం' గీత రచయిత ఎవరు?

# సమాధానాలు

1. లార్డ్ వేవెల్.
2. క్యూబా.
3. చంద్రగుప్త విక్రమాదిత్యుడు.
4. ఇటలీ.
5. అశ్వఘోషుడు.
6. వాల్టర్ హంట్.
7. అరుణాచల్ ప్రదేశ్.
8. బల్గేరియా.
9. మణిపూర్‌లోని 'మధుపూర్ నేషనల్ పార్క్.'
10. ఉత్తర ఆఫ్రికాలోని సహారా.
11. 1943వ సం॥లో బెంగాల్ కాటకం సమయంలో.
12. కామయాని.
13. ఈశాన్య సైబీరియా. మైనస్ 50° సెంటిగ్రేడ్.
14. 1915 వ సం॥లో.
15. సుకర్నో.
16. మృతుల మిట్ట.
17. కేరళ.
18. 1887 వ సం॥లో.
19. విశ్వనాథన్ ఆనంద్.
20. బంకించంద్ర ఛటర్జీ.




# ముసుగుమనిషి

కొండాపురం కొమరయ్యకు కొత్తగా పెళ్ళయింది. భార్య భానుమతిని బాడుగబండిలో కాపురానికి తీసుకువస్తూ, దారిలో ఒక ఏరును సమీపించగానే బండిని ఆపమని కిందికి దిగాడు. ఆ సమీపంలో ఒక పాత కాలపు పెంకుటిల్లున్నది. ఇంటి చుట్టూ వున్న కూరగాయలతోటలో తిరుగుతూ, కోసిన కాయలను ఒక బుట్టలో వేస్తున్నారు, ఇద్దరు మరుగుజ్జు దంపతులు.

వాళ్ళను చూసి కొమరయ్య, తనలో తాను నవ్వుకుంటూ బండి ఎక్కడం చూసి భానుమతి, "పాపం, ఆ మరుగుజ్జుల్ని చూసి నవ్వుతున్నారా?" అని అడిగింది.

"నాలుగు నెలల క్రితం జరిగిన ఒక సంగతి గుర్తుకు వచ్చి, అలానవ్వాను. అదేమిటో చెప్పమన్నావా?" అని అడిగాడు కొమరయ్య.

"చెప్పండి! ప్రయాణంలో కాలక్షేపంగా వుంటుంది," అన్నది భానుమతి.

కొమరయ్య చెప్పడం ప్రారంభించాడు: నాలుగు నెలల క్రితం అతడు ఇదే దారిన వస్తూండగా, ఏటికి ఉధృతంగా వరద వచ్చింది. బండివాడు మాట్లాడుకున్న దాంట్లో సగం బాడుగ డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ సరికి చీకటిపడి, వర్షం కూడా ఆరంభమైంది. కొమరయ్య దాపులకనిపించిన పెంకుటింటికి వెళ్ళి, తలుపు తట్టాడు. ఒక మరుగుజ్జు స్త్రీ తలుపు తీసి, "ఎవరు, బాబూ? ఏం కావాలి?" అని అడిగింది.

"ఏరు పొంగడంతో ఇక్కడ చిక్కుబడ్డాను. ఈ రాత్రికి మీ ఇంట్లో కాస్త తలదాచుకోనిస్తారా?" అని అడిగాడు కొమరయ్య.

"దానికేం భాగ్యం, బాబూ!" అంటూ పక్క గదిలోంచి బయటికి వచ్చాడు, ఆ ఇంటి యజమాని. అతడూ మరుగుజ్జే!

కొంత పొద్దుపోయాక, మరుగుజ్జు దంపతులు బలవంతం చేసిన మీదట, కొమరయ్య

మాచిరాజు కామేశ్వరరావు



కొమరయ్య వెళ్ళి తలుపు తీస్తూనే అదిరి పడ్డాడు. ఎదురుగా తళతళ మెరుస్తున్న కత్తితో, ఒక ముసుగుదొంగ.

ఇంతలో, "ఎవరూ! మా తమ్ముడు గాని వచ్చాడా?" అంటూ అక్కడికి వచ్చిన మరుగుజ్జు భార్య, ముసుగుదొంగను చూస్తూనే కెవ్వు మన్నది.

ముసుగుదొంగ చప్పున కత్తిని, మరుగుజ్జు భార్య కంఠంకేసి గురిచేసి, తన మీదికి దూక బోతున్న కొమరయ్యతో, "నువ్వు అడుగు ముందుకు వేశావో, ఈ పొట్టిదాని పీక తెగి పోతుంది, జాగ్రత్త!" అన్నాడు కర్కశంగా.

తర్వాత ఆమెను అడ్డుపెట్టుకుని దొంగ, మరుగుజ్జు భర్త ద్వారా పెట్టెలోని నగలూ, డబ్బూ మూట కట్టించాడు. కొమరయ్య చేతి ఉంగరంతోపాటు, జేబులోని డబ్బుకూడా తీసుకుని, దొంగ వీధితలుపుకు బయటి నుంచి గడియపెట్టి పారిపోయాడు.

మరుగుజ్జుదంపతుల నగలూ, డబ్బూ పోవడంచూసి, కొమరయ్య మనసు విల విల లాడిపోయింది. తనుతొందరపడి తలుపు తెరిచి వుండక పోతే, మరుగుజ్జు దంపతులకు ఇంత ధననష్టం జరిగి వుండేది కాదు!

కొమరయ్య, మరుగుజ్జు దంపతులకు క్షమాపణ చెప్పబోతూంటే, మరుగుజ్జు భర్త అడ్డుపడి, "నీకు చేతులెత్తి మొక్కాలి, బాబూ! దొంగ కత్తితో నా భార్యను బెదిరిస్తూండగా, నువ్వు తొందరపడి వాడి మీదికి పోయివుంటే,

వాళ్ళతో పాటు భోజనం చేశాడు. మాటల మధ్యలో మరుగుజ్జు భార్య, "మా తమ్ముడు తమ్మిరాజు సాయంత్రానికల్లా వస్తానన్నాడు. ఇంత పొద్దుపోయినా రాలేదు, ఎందువల్లో!" అంటూ కొన్ని రొట్టెలూ, కూరా ఒక పాత్రలో పెట్టి వంటింట్లో దాచింది.

ముందుగదిలో కొమరయ్యకు మంచం వేసి, లోపలి గదిలో పడుకున్నారు మరుగుజ్జు దంపతులు. కొంత సేపటికి అతడికి నిద్రపడు తూండగా, వీధి తలుపు చప్పుడయింది.

"ఎవరూ?" అంటూ లేచి కూర్చున్నాడు కొమరయ్య.

"నేను తమ్మిరాజును!" అన్నాడు తలుపు తట్టిన మనిషి.

వాడు నా భార్యను చంపేసి వుండేవాడు," అన్నాడు కొమరయ్య చేతులు పట్టుకుని.

మర్నాడు తెల్లవారుతూనే కొమరయ్య ఇంటికి వచ్చేశాడు. కాని, అతడికి మనశ్శాంతి లేకుండా పోయింది. అతడు, తల్లికి జరిగిందంతా చెప్పాడు. ఆమె చాలా బాధపడి, "నీ కారణంగానే, ఆ మరుగుజ్జు దంపతులకు ధననష్టం జరిగిన మాట నిజం. ఒక వెయ్యి రూపాయిలు తీసుకుపోయి వాళ్ళకిచ్చిరా," అంటూ కొమరయ్యకు డబ్బిచ్చింది.

ఆ డబ్బు తీసుకుని సంతోషంగా బయలుదేరాడు కొమరయ్య. ఏటిలో వరద పూర్తిగా తగ్గిపోవడంతో అతడు చీకటి పడుతూండగా పడవలో ఏరుదాటి, అవతలి ఒడ్డుకు చేరాడు.



అయితే, అతడు మరుగుజ్జు దంపతుల ఇంటిని సమీపిస్తూనే ఆశ్చర్యపోయాడు. ఇంటి బయట ఆనాటి ముసుగుదొంగ తచ్చాడుతున్నాడు. ఒక చెట్టు చాటు నుంచి కొమరయ్య వాణ్ణి గమనించ సాగాడు.

ఇంతలో పెరటి వైపు నుంచి మరుగుజ్జు భార్య బయటికి వచ్చింది. మళ్ళీ దొంగ ఆమెకు ఏ ఆపద తలపెడతాడో అని, కొమరయ్య చప్పున ముందుకు వెళ్ళబోయేంతలో, ఆమె దొంగను సమీపించి రహస్యంగా ఏదో మాట్లాడి, ఇంట్లోకి వెళ్ళింది.

దీనితో కొమరయ్యకు అంతా అర్థమైంది. ముసుగుదొంగ మరుగుజ్జుదంపతుల మనిషే! ముగ్గురూ కలిసి తెలివిగా నాటకం ఆడి అమాయకులయిన బాటసారులను దోచుకుంటున్నారన్న మాట!

కొమరయ్య క్షణం ఆలస్యం చేయకుండా, తలుపు తడుతున్న ముసుగు మనిషిని సమీపించి, పిడికిలితో వాడి మెడ మీద బలంగా కొట్టాడు. వాడు కిక్కురుమనకుండా కింద పడిపోగానే, వాడి ముసుగు వేసుకుని, కత్తిని చేతిలో పట్టుకుని తలుపు తడుతూ, "తలుపు తెరవండి, తమ్మిరాజును!" అన్నాడు.

విలువైన దుస్తులు ధరించిన, ఒక అరవై ఏళ్ళ బక్కపలచని మనిషి, తలుపు తెరుస్తూనే, "తమ్మిరాజువా? మీ అక్కయ్య నీకోసం ఎదురు చూస్తున్నది," అంటూ, కొమరయ్యను చూసి గజగజలాడుతూ గోడవారగా కుప్పకూలి

పోయాడు. అతడు ఆ రాత్రికి, ఆ ఇంట తల దాచుకోవచ్చిన పెద్దమనిషి.

ఇదేమీ తెలియని మరుగుజ్జు భార్య, పక్క గదిలోనుంచి బయటకువస్తూ, "మా తమ్ముడు తమ్మిరాజు వచ్చాడా?" అని, కొమరయ్యను చూసి కెవ్వుమని అరిచింది.

కొమరయ్య కత్తిని, ఆమె మెడ మీద ఆనించి, "ఏదీ, సమయానికి మీ ఆయన ఇంట్లో వున్నట్టు లేదే!" అంటూ మరుగుజ్జు భార్యచేత, ఇంట్లో వున్న డబ్బూ, నగలూ మూట కట్టించాడు. తర్వాత ఆమెను గదిలోకి పంపి బయట గొళ్ళెం పెట్టాడు.

ఆ తర్వాత అతడు తీరికగా కూర్చుని, మరుగుజ్జు దంపతులకు ఒక లేఖ రాశాడు: మీ బుద్ధులు, మీ రూపాలకు తగినట్టుగానే వున్నవి! లోకంలో దొంగతనం అంత హేయ మైనవృత్తి మరొకటి లేదు. ఒంటి మీది పచ్చ బొట్టయినా చెరపగలంగాని, ఒకసారి దొంగ అన్న ముద్ర పడితే చెరపడం అసాధ్యం. మోసంతో బాటసారులను దోపిడీ చేస్తున్నం దుకు, మిమ్మల్ని రక్షకభటులకు పట్టించ వచ్చు. కానీ మీ రూపాలు చూస్తే, మీపై కోపం రావడంలేదు. మీకొక అవకాశం ఇస్తు న్నాను. మీ ఇంటి చుట్టూ వున్న ఖాళీ స్థలంలో, నడుం వంచి కష్టపడితే, ఎన్నోరకాల కూరగాయలు పండించవచ్చు. ఆలోచించు కోండి. మీ ఇంట్లో దొరికిన దొంగసొత్తును, ఏ అనాథఆశ్రమానికైనా విరాళంగా ఇస్తాను.

ఈ లేఖ రాసి, ఇంకా గోడవారగా మూర్ఛలో వున్న బక్కవాడి జేబులో పెట్టి, కొమరయ్య తన ఊరుకు తిరిగివచ్చాడు.

ఇదంతా కొమరయ్య, భార్యకు చెప్పి, "ఇప్పుడు ఆ మరుగుజ్జు దంపతుల ఇంటి చుట్టూ వున్న కూరపాదులూ, పూలమొక్కలూ చూస్తే, వాళ్ళు దొంగబుద్ధులకు స్వస్తి పలికి, గౌరవంగా జీవిస్తున్నారని తెలుస్తున్నది. ఇందుకే నేను తృప్తిగా నవ్వుకున్నాను!" అన్నాడు.

"మీరు తెలివైన వాళ్ళే కాక, చాలా సాహస వంతులండీ! ఈసారెప్పుడైనా ఇటు వచ్చిన ప్పుడు, ఆ మరుగుజ్జు దంపతులను పలక రించి అభినందిద్దాం," అన్నది భానుమతి సంతోషంగా.



# చందమామ కబుర్లు

## కంప్యూటర్ స్నానం!



స్నానం చేయడానికి కూడా మీకు బద్ధకంగా ఉన్నారా? అయితే మీరు త్వరలో పత్రికలలో రానున్న బాస్-రాబో ప్రకటన కోసం ఎదురు చూడవచ్చు. అవును! కంప్యూటర్ నిర్దుష్టతతో స్నానం చేయించే రోబోట్‌ను జపాన్‌లో రూపొందించారు. మీరు చేయవలసిందల్లా 1.6 మీటర్ పొడవు గల తొట్టిలో కూర్చుని వేడి నీళ్ళ జల్లు పడగానే కళ్ళు మూసుకోవడమే. ఆ తరవాత సబ్బు నీళ్ళు మీ శరీరం మీద చల్లబడుతుంది. అటుపైన వేడి నీళ్ళ స్ప్రే. చివరగా చల్లటి గాలి వీచి మీ శరీరం మీది తడినంతా లాగేస్తుంది. మరి వీపు రుద్దడం ఎవరని అనుమానంగా ఉందా? ఆ అవసరమే లేదు. ఎందుకంటే కంప్యూటర్ స్నానంలో అన్నీ సక్రమంగా జరిగిపోతుంది. అయితే షాంపూ స్నానం చేయాలంటే మాత్రం, ముందుగా మీరే తలస్నానం చేసుకుని తొట్టిలో కూర్చోవాలి. ఎందుకంటే సబ్బు నీళ్ళు కళ్ళలోకి పడే అవకాశం వుంది. జపాన్‌లో ఐదు కంపెనీలు కలిసి ఈ 'బాత్-రాబోట్'ను రూపొందించాయి. అయితే, దాని ధరను చూసి కళ్ళు తేలవేయకండి - ఇంచుమించు 14 లక్షల రూపాయలే!

## ఇంగ్లీష్ ఛానల్‌లో ఫ్లాట్స్!

ఇంగ్లీష్ ఛానల్‌లో 19వ శతాబ్దంలో దేశరక్షణ కోసం నిర్మించిన ఒక కోట ఇప్పుడు ఆడంబర నివాస గృహాలుగా మారనున్నది! ఫ్రెంచి సేనలు ఇంగ్లాండును ఆక్రమించుకోకుండా చేయడానికి ఆంగ్లేయులు ఇంగ్లీష్ ఛానల్‌లో సైనిక రక్షణ దళం కోసం ఒక కోటను నిర్మించారు. 50 ఫిరంగులతో 400 మంది సైనికులు అక్కడ ఉండేవారు. ఇటీవల దానిని ఇళ్ళ గదులుగా మార్చడానికి 6.25 మిలియన్ అమెరికన్ డాలర్లకు విక్రయించారు. అందులో లైట్‌హౌస్, హెలికాప్టర్ పాడ్ కూడా ఉంటాయి.






# సామాన్యుడు-మహానుభావుడు

దేశాటన చేస్తున్న సాధువొకడు లక్ష్మీపుర గ్రామానికి వచ్చి, చెరువుకట్టపై వున్న మర్రిచెట్టు కింద నివాసం ఏర్పరచుకున్నాడు. ఆయన రోజూ గ్రామస్థులకు వేదాంతబోధ చేస్తుండేవాడు. ప్రతిరోజూ వంతులవారీగా గ్రామస్థులాయనకు భోజనం పెట్టేవారు.

సాధువొకరోజున లక్ష్మయ్య అనే అతని ఇంట భోజనం చేస్తున్నాడు. ఆ సమయంలో లక్ష్మయ్య ఇంటికి గురువులనే వాడు వచ్చి, "అయ్యా! మీ బాకీ అన్న ప్రకారం రేపటికి తీర్చవలసివుంది. కానీ, సమయానికి డబ్బు అందలేదు. మరొక నెలరోజులు గడువు కావాలి," అన్నాడు.

వెంటనే లక్ష్మయ్య, గురువుల్ని, "నువ్వు మాట నిలకడలేని మనిషివి. నీలాంటి వాడికి అసలు డబ్బు అప్పివ్వకూడదు," అంటూ కోపావేశంతో నానామాటలూ అని తిట్టి పంపించేశాడు.

సాధువు ఇది చూసి లక్ష్మయ్యతో, "నాయనా! కోపం అనర్థహేతువు. దానిని నిగ్రహించుకోవాలి. ఇంతకూ నువ్వు గురువుల్ని తిట్టి సాధించినదేముంది? నీ అక్కసు కొంత తీరిందే తప్ప, దానివల్ల నీకు చేరవలసిన డబ్బేం ముందుగా రాదు కదా!" అన్నాడు.

లక్ష్మయ్య, సాధువుకు వినయంగా నమస్కరించి, "స్వామీ! నేను తిట్టానని ఎవరూ బాధపడరు. ఎందుకంటే నా కోపం క్షణికం. ఎవరినైనా సరే ఇలా తిట్టి అలా మరిచిపోతాను. వాళ్ళ మీద నాకేవిధమైన పగా వుండదు," అన్నాడు.

అప్పుడు సాధువు, లక్ష్మయ్యను మెచ్చుకుని, "కోపాన్ని నిగ్రహించుకోవడం మంచిది. కానీ, కోపం క్షణికమే అయితే చాలా గొప్ప విశేషం! పైగా, నీ మనసులో ఎదుటి వారి మీద కోపముండకపోవడం మరింత గొప్ప విశేషం," అని చెప్పి ఇంకా ఏదో చెప్పబోతూండగా,

శ్రీరామకమల్

అక్కడికి లక్ష్మయ్య స్నేహితుడు రుద్రయ్య వచ్చాడు.

వాడు సాధువును చూస్తూనే, "పని చేయకుండా ఇతరుల కష్టంమీద బ్రతికే, సోమరులను చూస్తే నాకు అసహ్యం. నువ్విలాంటి వాళ్ళకు తిండి పెట్టడం బుద్ధిగల పనేమీ కాదు," అన్నాడు.

దీనికి లక్ష్మయ్య నొచ్చుకుని క్షమాపణ కోరబోతే సాధువు వారించి, "ఎవరి అభిప్రాయం వారిది! ఇందుకు ఎవరినీ తప్పు పట్టరాదు," అంటూ చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొన్నాళ్ళకు లక్ష్మయ్య, సాధువును చూసేందుకు ఆయన నివాసస్థానమైన మర్రిచెట్టు దగ్గరికి వెళ్ళాడు. ఆ సమయంలో అక్కడ అతడికి, అదే గ్రామంవాడైన పుల్లయ్య కనిపించాడు.

పుల్లయ్యను చూస్తూనే లక్ష్మయ్య వాడి భుజం పట్టుకుని, "ఏరా! ఎన్నాళ్ళని తప్పించుకు తిరుగుతావు? ఇప్పుడు దొరికిపోయావు, చూడు. ఈ రోజుతో నువ్వో నేనో తేలిపోవాల్సిందే!" అన్నాడు.

సాధువు వెంటనే జోక్యం చేసుకుని, "శాంతం! నాయనా, శాంతం! అసలేం జరిగిందో చెప్పు," అన్నాడు.

లక్ష్మయ్య, పుల్లయ్యను వదిలి, "స్వామీ! నెల్లాళ్ళ క్రితం నేను గుడిలో పూజ చేయిస్తూంటే పూజారి మెచ్చుకున్నాడు, నా దైవభక్తిని. అక్కడే వున్న పుల్లయ్య,'చెడ్డపనులు చేసే వాళ్ళకే దైవభక్తి ఎక్కువగా వుంటుంది,' అని



వెంటనే అక్కణ్ణించి పారిపోయాడు. అక్కడున్న వాళ్ళందరూ వీడి మాటలకు హేళనగా నవ్వారు. నాకెంతో అవమానమయింది," అని చెప్పాడు.

సాధువు, పుల్లయ్యను మందలించి, "ఎదుటివారిని నొప్పించే మాటలనడం తగదు," అన్నాడు.

ఇంతలో రుద్రయ్య అక్కడికి వచ్చి, "స్వామీ! సాధుపురుషుల గొప్పతనం అర్థం కాక మిమ్మ ల్నొక రోజున చాలా కించపరిచాను. నన్ను మన్నించండి!" అంటూ సాధువు కాళ్ళమీద పడ్డాడు.

సాధువు మందహాసం చేసి, "మన్నించడా నికి నువ్వు చేసిన అపరాధమేమిటో, నాకు తెలియదు నాయనా. నీకొచ్చిన కష్టమేమైనా వుంటే చెప్పు. నా శక్తి కొద్దీ సాయపడతాను," అన్నాడు.

జరిగిందేమంటే — రుద్రయ్య భార్యకు జబ్బు చేసింది. అది మామూలు జబ్బుకాదనీ దుష్టగ్రహం సోకిందనీ కొందరన్నారు. సాధువు వల్ల తప్ప ఆ దుష్టగ్రహం తొలగిపోదని అంతా అంటే, మరొక మార్గం లేక రుద్రయ్య సాధువు దగ్గరకు వచ్చాడు.

సాధువు, రుద్రయ్య ఇంటికి వెళ్ళి మంత్రో చ్చారణ చేసి, రుద్రయ్య భార్యను దీవించాడు. మర్నాటికల్లా ఆమె కోలుకుని మామూలు మనిషయింది.

ఇది చూసిన లక్ష్మయ్య ఆశ్చర్యపడి సాధువు దగ్గరకు వెళ్ళి, "స్వామీ! మిమ్మల్ని అకారణంగా నిందించిన రుద్రయ్యను క్షమించి మేలు చేశారు. మీరు నిజంగా మహానుభావులు!" అన్నాడు.

ఇందుకు సాధువు నవ్వి, "నేనూ నీలాంటి వాడినే! నువ్వు ఎదుటి వాళ్ళను తిట్టి మరిచి పోతావు! నేను ఎదుటి వాళ్ళు తిడితే వెంటనే మరిచిపోతాను! ఆ కారణంగా ఎవరినైనా తిడితే అది జీవితకాలం నన్ను బాధిస్తుంది. అందుకే, ఎవర్నీ తిట్టకుండా జాగ్రత్త పడ తాను," అన్నాడు.

సామాన్యుడికీ, మహానుభావుడికీ వుండే తేడా అప్పుడు లక్ష్మయ్యకు అర్థమై, క్రమంగా తన కోపాన్ని తగ్గించుకున్నాడు.






రామరాజ్యంలో న్యాయం కోసం ఎక్కువ, తక్కువ మొదలైన తేడాలు లేకుండా ఎవరైనా సరే నిరాటంకంగా వెళ్లి రాజుతో చెప్పుకొని న్యాయం పొందవచ్చు. ఒకనాటి రాత్రి ఒక కుక్క రక్తం ఓడుతూ కొనప్రాణంతో వెళ్ళి రాముడు ఉండే సౌధం ముందు నిలిచి పిలుస్తున్నట్టుగా మొరిగింది.

రాముడు మేల్కొని లేచి వచ్చి కుక్క తల నిమిరాడు. దాని బాధ అంతా మాయమై ఉత్తేజం వచ్చి, "ఓ రామా! ఒక యువకుడు నన్ను అన్యాయంగా చావగొట్టాడు. వాడికి ఉద్యోగం సద్యోగం లేక చెడుతిరుగుళ్ళు తిరుగుతున్నాడు. వాడినో పెద్ద దేవస్థానం ధర్మకర్తగా చేయవలసిందిగా కోరుతున్నాను," అన్నది.

రాముడు ఆశ్చర్యంతో, "నీకు హాని చేసిన వాడికి మరణదండనో, కఠినశిక్షనో విధించమని కోరకుండా అపకారికి ఉపకారం కోరుతున్నావా?" అని అడిగాడు.

"ఇందులో అదేమీ లేదు. క్రిందటి జన్మలో నేనొక పెద్ద దేవస్థానం ధర్మాధికారిగా, ప్రధాన పూజారిగా ఉండి దేవాదాయాన్ని కాజేసి, చేయని అకార్యమంటూ లేకుండా చేసి ఈ జన్మలో కుక్కగా పుట్టాను. ఆ యువకుడు కుక్కగా పుట్టి నాలాగే అగచాట్లు పడాలి; నా కసి తీరాలి, అనుకున్నాను. అందుకే ఆ కోరిక కోరాను. కాని పతితపావనమైన నీ హస్తస్పర్శ వల్ల నా కసి పోయింది; నేను ఉత్తమ గతులు పొందబోతున్నాను," అని చెప్పి కుక్క ప్రాణాలు విడిచింది.



"రామా! నువ్వు మహావిష్ణువువి. నీవు అవతరించిన పని పూర్తి అయింది. సీత లక్ష్మిగా, పుట్టినిల్లయిన క్షీరసాగరంలో నీకోసం నిరీక్షిస్తున్నది. ఆదిశేషుడు, శంఖచక్రాలైన నీ తమ్ములతో నీవు క్షీరసాగరం చేరుకోవాలి!" అని చెప్పాడు.

అదే సమయంలో దుర్వాసుడు హుటాహుటిగా వచ్చి లక్ష్మణుడితో, "నేను ఇప్పుడే రాముణ్ణి చూడాలి! లేకుంటే రఘువంశం నశించేలాగా శపిస్తాను, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

వంశనాశనానికి బదులు తాను శిరచ్ఛేదం పొందటమే మంచిదని లక్ష్మణుడు తలంచి, దుర్వాసుడి రాకను రాముడితో చెప్పడానికి లోపలికి వెళ్లాడు.

వెంటనే యముడు అంతర్ధానమయ్యాడు.

రాముడు తాను మాట ఇచ్చిన ప్రకారం లక్ష్మణుడికి శిరచ్ఛేదం విధించాడు. పెద్దలు ఆలోచించి దేశబహిష్కరణ శిరచ్ఛేదంతో సమానమే గనక, లక్ష్మణుడిని దేశం నుంచి వెళ్ళగొట్టి పంపితే చాలునని రాముడికి సలహా ఇచ్చారు. లక్ష్మణుడు అంతా విని, వెళ్ళి సరయూ నదిలో పడి తన అవతారం చాలించాడు.

లక్ష్మణుడు సరయూనదిలో మునిగిన తర్వాత రాముడు భరతశత్రుఘ్నులకు విషయమంతా చెప్పి, లవకుశుల పట్టాభిషేకానికి చేయవలసిన ఏర్పాట్లన్నీ చూడమని చెప్పాడు.

తరవాత ఆ కుక్కను కొట్టిన యువకుడు అంతా తెలుసుకొని, పశ్చాత్తప్తుడై ఉత్తముడిగా మారాడు.



అశ్వమేధయాగం చేసి రాముడు కొద్ది కాలం సక్రమంగా రాజ్యపాలన చేశాక, ఒక నాడు యముడు బ్రాహ్మణరూపంలో అక్కడికి వచ్చి, "రామా! నీతో కొంత సేపు రహస్యంగా మాట్లాడాలి. మనం మాట్లాడుకుంటూండగా ఎవరు వచ్చినా శిరచ్ఛేదం చేయాలి!" అని చెప్పాడు.

రాముడు అందుకు సమ్మతించి లక్ష్మణుడికి ఆ సంగతి చెప్పి, ద్వారం దగ్గిర కాపు ఉంచి, యముడితో రహస్య మందిరంలోకి వెళ్ళాడు.

అయోధ్యా నగరం అంతా దివ్యంగా అలంకరించబడింది.

రాముడు లవకుశులకు రాజ్య పట్టాభిషేకం చేసి, హనుమంతుడిని పిలిచి, "హనుమంతా! నేను చాలాకాలం రాజ్యపాలన చేసి విశ్రాంతి కోరుకుంటున్నాను. నేను ఉంటాను, లేకపోతాను. నీవు మాత్రం కుశలవులకు పెద్ద దిక్కుగా వుండి అన్నీ చూసుకుంటూ ఉండు! రాజ్యరక్షణ భారం నీమీద పూర్తిగా ఉంచుతున్నాను. వీరినే నన్నుగా చూసుకో. అండగా నిలిచి వాళ్ళను ఉత్తమ పాలకులుగా తీర్చిదిద్దే బాధ్యత నీది!" అని చెప్పాడు.

హనుమంతుడు మౌనంగా చేతులు జోడించి, తల దించుకున్నాడు.

రాముడు సరయూనదికి వెళ్ళడానికి పెద్ద ఊరేగింపు ఏర్పాటు చేయించాడు. ఆ రోజు మహోదయ పర్వదినం. మంగళ ధ్వనులు మారుమోగుతున్నాయి. బ్రాహ్మణులు వేదఘోష చేస్తున్నారు. తూర్యనాదాలు మిన్నుముట్టుతున్నాయి. రాముడు సరయూనదికి పాదచారిగా బయలుదేరాడు. భరతుడు అతనికి తెల్ల గొడుగు పట్టాడు. శత్రుఘ్నుడు వింజామరం వీస్తున్నాడు. మేడల మీది నుంచి పుణ్యాంగనలు పూలజల్లు కురిపిస్తున్నారు. హనుమంతుడు రాముడి వెనక మందంగా మతిపోయినవాడిలాగ అడుగులు వేస్తున్నాడు. రాముడు సరయూనదికి ఎందుకు వెళుతున్నాడో తెలియని ప్రజలు పరిపరివిధాలుగా చెప్పుకుంటూ అనుసరించసాగారు.





కొంతసేపటికి ఊరేగింపు సరయూనది తీరం చేరింది.

రాముడు సరయూనది నీళ్లలో పాదాలు మోపాడు. భరతుడు శంఖాన్ని పూరించాడు. శత్రుఘ్నుడు కర్పూరహారతి వెలిగించి, చక్రంగా తిప్పాడు. బ్రాహ్మణులు సామవేదం గొంతెత్తి చదువుతున్నారు. మంగళవాద్యాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నది. భరతశత్రుఘ్నులు కూడా నదిలోకి దిగి రాముడి భుజాల వెనక ఇరు పక్కలా నిలబడ్డారు.

రాముడు మెల్లగా నదిలో నడుస్తూ, లోతుకు వెళ్ళి నిల్చుని కుడిచేయి ఎత్తి, అర చేత్తో అభయముద్ర పట్టి ప్రజలను ఆశీర్వదిస్తూ, "సంతోషంగా ఇళ్ళకు వెళ్ళండి. సుఖ సంతోషాలతో చిరకాలం వర్థిల్లండి!" అని అన్నాడు.

లవకుశుల దగ్గిర నిల్చున్న హనుమంతుడు విలవిల్లాడిపోతూ, "రామా! ఆగు! నీ కంటే ముందు నేనే నదిలో తనువు చాలిస్తాను. నువ్వు లేకుండా నేనెందుకు?" అని గుండెలు బాదుకొంటూ నదిలో దిగబోతూంటే, రాముడు ముక్కు మీద వేలు పెట్టి వారిస్తూ, "హనుమా, నువ్వు చిరంజీవివి! నేను చెప్పినదంతా మరిచావా? లవకుశులను వెంట బెట్టుకొని త్వరగా ఇక్కడినుంచి కదులు!" అని గట్టిగా ఆజ్ఞాపించాడు. హనుమంతుడు లవకుశులతో రాజమందిరానికి వెళ్ళాడు.

రాముడు సరయూనది లోతుల్లోకి వెళ్ళి, కనిపించలేదు. రాముడి వెనకనే భరత శత్రుఘ్నులు నదిలో కలిసిపోయారు. రామావతారం ముగిసింది. క్షీరసాగరంలో లక్ష్మణుడు ముందుగానే ఆదిశేషుడై పాన్పుగా అమరి ఉన్నాడు. రసాతలం నుంచి సీత లక్ష్మిగా వచ్చి కూర్చొని ఎదురుచూస్తున్నది. రాముడు విష్ణువుగా శేషతల్పం మీదకు చేరుకున్నాడు. భరత శత్రుఘ్నులు శంఖ చక్రాలుగా అతని చేతుల్లో ఉన్నారు. లక్ష్మి మహావిష్ణువు పాదాలు ఒత్తసాగింది.



ఒకనాడు కుశలవులు సింహాసనం మీద కూర్చొని తల్లిని, తండ్రిని తలచుకొని వెక్కి వెక్కి కన్నీరుకారుస్తూండగా, హనుమంతుడు

చూసి, వారిని ఓదార్చుతూ, "రఘువంశ దీప కులైన మీరు గొప్పగా రాజ్యపాలన చేయాలి గాని దిగులుపడవచ్చా? మీకు చూడాలని పించినప్పుడల్లా సీతారాములను నేను చూపి స్తాను. వారు నా గుండెలో ఎంత ఆనందంగా ఉన్నారో చూడండి!" అంటూ తన రొమ్ము చీల్చి చూపించాడు.

అందులో చిరునవ్వుతో ప్రేమతో చూస్తూ ఆశీర్వదిస్తున్న తమ తల్లిదండ్రులను చూసి, కుశలవులు ఎంతగానో సంతోషించారు.

కుశలవులు యువకులై చక్కగా రాజ్య పాలన నిర్వహిస్తున్నారు. తూర్పున మణి పురాన్నీ, పడమట మధురానగరాన్నీ ఉప రాజధానులుగా చేసి, శుభతో కుశుడు మణి పురంలోనూ, శోభతో లవుడు మధురలోనూ ఉంటూ,రెండువైపులా శాంతిభద్రతలు చూసు కుంటున్నారు.

అంతలో దేశానికి గొప్ప ఆపద ముంచు కొచ్చింది. రాక్షసుడి కంటే క్రూరాతి క్రూరు డైన ఘోరకలి అనే నరరూప రాక్షసుడు శకులు, కుషాణులు, పాషాణులు అనే కొండ జాతి దుండగులను కూడగట్టుకొని దండ యాత్ర చేస్తూ, వాయవ్య దిశ నుంచి విరు చుకుపడ్డాడు. వాడి సేనలైన దుండగులు పశ్చిమోత్తర రాజ్యభాగం మీదపడి అల్లకల్లోలం చేశారు.

ఘోరకలికి తోడు పడమటి దిక్కున కాల కలి అనే మరొక నరరూపరాక్షసుడు పెద్ద



నౌకాబలంతో, కాలకేయులనే సముద్ర రాక్షస సేనలతో సముద్రం నుంచి విజృంభించాడు. కాలకలి ఆజ్ఞల ప్రకారం కాలకేయులు రాజ్యా లను కొల్లగొడుతూ అంతులేని ధనధాన్యాలను వాళ్ళ స్థావరమైన కాలకూట ద్వీపానికి చేరు స్తూంటారు.

ప్రజలు భీతితో తల్లడిల్లిపోతూ, ఎవరి ధనప్రాణాలనువారురక్షించుకోడానికి దారులు వెతుక్కోసాగారు. అప్పుడు హనుమంతుడు ప్రజల మధ్యకు వచ్చి, ఎవరి ఆత్మరక్షణ వారు చూసుకోవడం సరికాదనీ, అందరూ ఏకమై దేశరక్షణ చేసుకోవాలనీ ఉత్తేజపరి చాడు. రామసేన అనే పేరుతో దేశ ప్రజల్ని సైనికులుగా తయారుచేసి వారికి శిక్షణనిచ్చి,



కుశుడు గొప్పగా యుద్ధం చేసి, ఘోర కలిని ఆగ్నేయాస్త్రంతో చంపాడు. రామసేన వాడి సేనల్ని తరిమికొట్టింది. దుండగుల్ని హతమార్చారు.

లవుడు కాలకలితో ఘోరయుద్ధం చేసి, వాడిని వారుణాస్త్రంతో హతమార్చాడు. రామసేన ప్రజలు కాలకేయ రాక్షసులను దొరికిన మట్టుకు మట్టుపెట్టారు. హనుమంతుడు తన వాలంతో నౌకలను చుట్టబెట్టి సముద్రంలో ముంచివేశాడు. నౌకలతో బాటు కాలకేయులు చచ్చారు.

రెండు ఘనవిజయాలు సాధించిన ప్రజలతో హనుమంతుడు – రాముడేలిన భూమిలో ప్రతి పౌరుడూ లవకుశులకు సోదరుడనీ, సోదరులంతా సమానులుగా, రామదండుగా ఉంటూ ఏ ఒక్కరికి కష్టం కలిగినా అదే అందరిదిగా భావించి తొలగించాలనీ, అదే దేశభక్తి అనీ ఉద్బోధించి రాజ్యాన్ని సురక్షితం చేశాడు.

విజయచిహ్నాలుగా హనుమంతుని ప్రోత్సాహంతో కుశుడు తనపేరిట కుశావతి అనే నగరాన్నీ, లవుడు తనపేరిట లవంతిక అనే నగరాన్నీ నిర్మించారు.

లవకుశులు సమర్థవంతంగా రాజ్యపాలన చేస్తున్నారు. వారి బలపరాక్రమాల మీద హనుమంతుడికి మంచి నమ్మకం కుదిరింది. వారు రామరాజ్యం పేరు నిలబెట్టుతూ, రాజ్య నిర్వహణ చేస్తున్నందుకు సంతృప్తి కలిగింది.

వారిలోని ధైర్యసాహసాలను పురికొలిపి దుండగుల మీదికి నడిపించాడు.

రాముడు పాలించిన రామరాజ్యంలో దేశమంతా రామసేనగా ఉంటే సాధించ లేనిదంటూ ఉండదనీ, ఎటువంటి ఉపద్రవాల భయమూ ఉండదనీ నచ్చజెప్పి, దుండగులను ఎదుర్కొనడానికి పురిగొలిపాడు. దేశ ప్రజలందరూ యోధులుగా హనుమంతుడి నాయకత్వంలో ఘోరకలితోను, కాలకలితోను యుద్ధానికి తలపడ్డారు. అప్పుడు హనుమంతుడు రెండు యుద్ధరంగాల్లోనూ వెయ్యి రూపాలతో, ఎక్కడ చూసినా హనుమంతుళ్ళుగా కనిపిస్తూ, సహస్రరూపాంజనేయుడని అనిపించుకున్నాడు.

తాను ఇక గంధమాదనపర్వతానికి వెళతానని లవకుశులకు చెప్పాడు. వాళ్ళు అందుకు అంగీకరించారు.

కుశలవులు పెద్ద ఉత్సవంతో హనుమంతుడిని తీసుకువచ్చి గంధమాదన పర్వతం దగ్గర దిగబెట్టారు.

హనుమంతుడు చిరకాలం రఘువంశ ప్రతిష్ఠలను నిలబెట్టుతూ వర్థిల్లండని కుశలవులను ఆశీర్వదించాడు. ప్రజాసమూహాన్ని ఉద్దేశించి హనుమంతుడు, "రామదండుగా దేశమంతా కలిసికట్టుగా పనిచేస్తే సాధించలేనిది లేదు. రామరాజ్యంలో అందరూ లవకుశులే!" అని చెప్పి వారిని అయోధ్యకు మరలమన్నాడు.

ప్రజలు హనుమంతుడికి నమస్కరించి చేతులెత్తి, "జై వీరహనుమాన్!" అంటూ జయజయధ్వానాలు చేస్తూండగా తపస్సు చేసుకోడానికి హనుమంతుడు గంధమాదన పర్వతానికి వెళ్ళిపోయాడు.

కుశలవులు, వారి సంతతివారు రామరాజ్యం పేరు నిలుపుతూ రఘువంశ కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేస్తూ చిరకాలం రాజ్యపాలన చేశారు.

హనుమంతుడు గంధమాదన పర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు.

❖ ❖ ❖ ❖

ఆవిధంగా గంధమాదన పర్వతం మీద తపస్సులో నిమగ్నమైవున్న హనుమంతుడికి ఒక్కసారి ధ్యానభంగమై కళ్ళు తెరిచాడు. పర్వతాలు కురచగా కనిపించాయి. మహావృక్షాలు మొక్కల్లాగా, ఏనుగులు ఎలుకల్లాగా తోచాయి; ఆకాశాన్ని పరికించాడు. సప్తర్షి మండలం ధ్రువనక్షత్రానికి దూరంగా జరిగి వుంది. దాన్నిబట్టి యుగం మారిందని అనుకున్నాడు. అదే సమయంలో త్రికాలజ్ఞుడైన నారదుడు అటే వచ్చి, "ఇప్పుడు ద్వాపర యుగం మొదటి పాదం ప్రారంభంలో ఉన్నది, హనుమా! ఈ ద్వాపరయుగం నాలుగో పాదంలో నీకు రామ సందర్శనం కలుగుతుంది!" అని చెప్పి వెళ్ళాడు.

హనుమంతుడు తిరిగి తపస్సు అందుకున్నాడు.





# గజ ఈతగాడు

చాలా ఏళ్ళ క్రితం పశ్చిమ సముద్రతీరాన కేరళ రాజ్యానికి చెందిన ఒక దీవి లక్క దీవులకు కొంచెం దూరంలో ఉండేది. అది చాలావరకు రాతిమయంగా ఉండటం చేత అక్కడ వ్యవసాయానికీ, ఇతర వృత్తులకూ అవకాశం వుండేది కాదు. కనుక ఆ దీవిలో నివసించే వారు ప్రధానంగా చేపలు పట్టి జీవించేవారూ, పశువులను పోషించేవారూ అయి ఉండేవారు. అక్కడి బెస్తలలో కొందరు నావికులుగా వెళ్ళిపోయేవారు. మరికొందరు సముద్రం అడుగుకు వెళ్ళి ముత్యపుచిప్పలూ, పగడపు రాళ్ళూ తెచ్చి వాటిని దీవిలోని వర్తకులకమ్మి పొట్టపోసుకునే వారు.

ఆ దీవిలో ఉండే ఒక ముసలి బెస్తవాడికి చాలామంది కొడుకులు. వారిలో చాలామంది చేపలు పట్టడంలో తండ్రికి సహాయం చేసి, తాము కూడా అదే వృత్తి అవలంబించారు. ఒకరిద్దరు వర్తక నౌకలలో పనులు సంపాదించుకున్నారు. వారిలో ఆఖరివాడు చిన్నతనం నుంచీ ఒక విచిత్రమైన ప్రకృతి కలవాడు. చేపలు తన్నుకుని చావటం వాడు చూడలేకపోయేవాడు. చిన్నతనంలో వాడు తీరానికి వెళ్ళి, తన తండ్రీ, అన్నలూ పట్టుకొచ్చిన చేపలను తట్టలతో మోసుకుపోయేటప్పుడు, ఏ చేపలోనైనా ప్రాణం ఉన్నట్టు కనిపిస్తే దాన్ని వెంటనే నీటిలోకి విసిరివేసేవాడు. ఒక్కొక్కసారి వాడు ఇంటికి చేరేసరికి తట్టలో సగం చేపలు కూడా ఉండేవి కావు.

ఈవిధంగా వాడు భూతదయ కలిగి వుండటం చేత వాడికి చేపలు పట్టే వృత్తి అబ్బలేదు. కాని వాడికి సముద్రమన్నా, చేపలన్నా అంతులేని ప్రేమ. "ఎందుకూ పనికి రాని మొద్దు!" అని తల్లిదండ్రుల చేత తిట్లు తిని, వాడు సముద్రతీరానికి వెళ్ళి గంటల తరబడి కూర్చునేవాడు. సముద్రంలో ఈతలు కొట్టేవాడు. భూమి మీద కన్నా వాడికి



సముద్రం అడుగున ఎక్కువ వింతలూ, రంగులూ, ఆకర్షవంతమైన దృశ్యాలూ కనిపించేవి. అందుచేత వాడు నీటి అడుగున చాలాసేపు వుండటం అభ్యాసం చేసి, అట్టడుగు సముద్రంలో సంచరించటమూ, అక్కడ వుండే వింత వింత చేపలనూ, పగడపు చెట్లనూ, విచిత్రమైన కాంతులనూ చూసి ఆనందించటమూ సాగించాడు.

పెరిగి పెద్దవాడయేసరికి వాడు వెళ్ళినంత సముద్రపు లోతులకు వెళ్ళి, నీటి అడుగున వాడున్నంతసేపు ఉండగలవాడు ఆ దీవిలో ఒక్కరు కూడా లేడు. వాడికి "చేపమనిషి" అని అందరూ పేరు పెట్టారు. వాడు ఉదయమే వెళ్ళి పగలంతా సముద్రంలో గడిపి, చీకటిపడ్డాక ఇంటికి తిరిగివచ్చి, తాను ఆ రోజు చూసిన వింతలన్నిటినీ తన అన్నలకు వర్ణించి చెప్పేవాడు. సముద్రం అడుగున మునిగిపోయిన పడవలుండేవి. వాటి పగుళ్ళలో నీటిమొక్కలు పెరిగేవి. పగడపు శిలల మీద శాఖలు శాఖలుగా ఎర్ర, తెల్ల పగడపు కొమ్మలుండేవి. నీటిలో ముత్యపు చిప్పలూ, నక్షత్ర చేపలూ, కనీవినీ ఎరగని గాజులాటి చేపలూ, ఎన్నో వుండేవి.

వాటన్నిటినీ వాడు వర్ణిస్తూంటే అన్నలు వినిపించుకోక, వాడికి నిశ్చయంగా పిచ్చేననుకునేవారు. వాడికి గాలి సోకిందేమోనని వాడి తల్లి తాయెత్తులు కట్టించింది. కానీ తాయెత్తులతో వాడి ధోరణి మారలేదు. పైగా వాడికి గొప్ప ఖ్యాతి వచ్చింది. "చేపమనిషి" అనే మాట దీవిలోని అందరి నోటా వినపడి, చివరకు ఆ దేశపు రాజు దాకా వెళ్ళింది.

అందుచేత రాజుగారు వాడిని ఒకసారి తన భవనానికి పిలిపించాడు.

వాడు రాజుగారి దర్శనానికి వెళ్ళినప్పుడు రాజుగారి కూతురు, పదిహేడేళ్ళ పిల్ల కూడా అక్కడ ఉన్నది.

"ఏమిరా, నువ్వు ఎంత లోతు సముద్రం అడుగుకైనా దిగగలవట, సముద్రాన్ని గాలించటంలో నీకు ఈడయినవాడు ప్రపంచంలో లేడట? ఆ మాట నిజమేనా?" అని రాజు అడిగాడు.

"ఇతరుల మాట నాకు తెలియదు, మహా రాజా!" అన్నాడు వాడు.

"నీ శక్తి చూస్తాం!" అంటూ రాజుగారు అప్పటికప్పుడే తన విహార నౌకలో తన కుమార్తెతో పాటు వాణ్ణి కూడా ఎక్కించుకుని, సముద్ర మధ్యానికి నౌకను నడిపించి, ఒక బంగారు పాత్రను సముద్రంలో గిరవాటు వేసి, "దాన్ని తీసుకురా!" అన్నాడు.



వాడు సముద్రంలో మునిగి, అడుగుకు చేరి, బంగారు పాత్రను తీసుకుంటూ, అక్కడే వున్న పగడపు కొమ్మ ఒకటి విరిచి పైకి వచ్చాడు. వాడా పగడపు కొమ్మను రాజ కుమార్తెకిచ్చి, బంగారు పాత్రను రాజుగారి కివ్వబోయాడు.

"అది నీవే వుంచుకో. ఇంతకన్న కష్టమైన పని చెబుతాను, చేస్తావా?" అన్నాడు రాజు.

"చెప్పండి, చాతనైతే చేస్తాను," అన్నాడు.

"నీవీ దీవిచుట్టూ వున్న సముద్రం దిగువ భాగమంతా తిరిగి, అక్కడి విశేషాలు నాకు చెప్పాలి," అన్నాడు రాజు.

"చాలా దూరం," అన్నాడు వాడు.

"నాకు తెలుసు. నీకు కావలసినంత వ్యవధి తీసుకో. అవసరమైనప్పుడు విశ్రాంతి కూడా తీసుకో. కానీ, దీవిని చుట్టి, అక్కడి విశేషాలు తెలుసుకోకుండా మాత్రం నా దగ్గ రికి తిరిగి రాకు," అన్నాడు రాజు.

"అయితే ఇక్కడే వుండండి," అని వాడు రాజకుమార్తె కేసి చూసి సముద్రంలో ముని గాడు. వాడు తిరిగి రావటానికి మూడు మాసాలు పట్టింది.

"మహారాజా, మా దీవికి అడుగున మూడు బ్రహ్మాండమైన కొండలు ఆధారం వున్నాయి. వాటితాలూకు రాయి మామూలు కొండరాయి కన్న చాలా బలమైనది. అయితే వాటిలో ఒకటి నశించిపోతున్నది," అన్నాడు వాడు.

"నశించిపోతున్నదా? ఎందుకూ?" అని రాజు అడిగాడు.

"దాని దిగువ భాగంలో అగ్ని ప్రజ్వరిల్లు తున్నది. అది రాతిని ధ్వంసం చేస్తున్నది. ఆ అగ్ని ఉన్న ప్రాంతంలో చాలామేరకు ఒక్క నాచుమొక్కగాని, ఒక్క చిన్న చేపగాని లేదు," అన్నాడు వాడు.

"నీటి అడుగున అగ్ని ఏమిటి?" అన్నాడు రాజు.

"మహారాజా, అది మామూలు అగ్ని కాదు. అది బడబాగ్ని. నీరు దాన్ని చల్లార్చ లేదు," అన్నాడు వాడు.

"బడబాగ్ని అనే మాట విన్నాను గాని ఎన్నడూ చూడలేదు. కొంచెం అగ్ని తెచ్చి చూపించు," అన్నాడు రాజు.

"అగ్నిని తీసుకురావటం ఎలా మహా రాజా?" అన్నాడు వాడు.

"నేనేం చెప్పగలను! అది నీకే తెలియాలి," అన్నాడు రాజు.

వాడు మళ్ళీ సముద్రం అడుగుకు వెళ్ళాడు. అగ్నిని సమీపించటానికి ప్రయత్నాలు చేశాడు. చేతులూ, కాళ్ళూ కాలాయి. వాడు కాలిన శరీరంతో విహారనౌక వద్దకు తిరిగి వచ్చి, "అగ్నిని తీసుకురావటం నాకు సాధ్యంకాలేదు, మహారాజా. ఇదుగో, దాని సాక్ష్యం!" అంటూ తన చేతులూ, కాళ్ళూ ఆయనకు చూపాడు.

"ఇప్పుడు నీ మాట నమ్మగలను. నీవు నిజంగా గజఈతగాడివే," అన్నాడు రాజు.

"ఈసారి అగ్నిని చాలా దగ్గిరగా చూశాను, మహారాజా. అది ఒక కొండను చాలా భాగం తినేసింది. దీవికి త్వరలోనే గొప్ప ప్రమాదం రానున్నదని నా నమ్మకం," అన్నాడు వాడు.

రాజుగారు వాడి మాట మీద నమ్మకం ఉంచి, ఆ దీవిలో ఉండే వారందరినీ దీవి వదిలి రావలసిందని ఉత్తరువు చేశాడు. వారికి నివాసయోగ్య ప్రదేశాలు ఏర్పాటు చేశాడు. దీవిని మనుషులూ, పశువులూ విడిచిపెట్టిపోయిన కొద్ది రోజులకే ఆ దీవి మీద భయంకరమైన భూకంపాలు కలిగి, ఒక మాసం రోజుల లోపల దానిలో ఒక్కొక్క భాగమే సముద్ర జలంలోకి ఒరిగిపోయింది.

రాజు "చేపమనిషి"ని పిలిపించి, "నీ ప్రజ్ఞ వల్ల అనేకవేలమంది ప్రాణాలుదక్కాయి. ఏమి బహుమతి కోరుకుంటావో కోరుకో ఇస్తాను," అన్నాడు.

వాడు రాజకుమార్తె కేసి చూసి, జవాబు చెప్పలేదు. తన కూతురి అభిప్రాయం అది వరకే తెలుసుకుని ఉన్న రాజు వాడికి ఆమె నిచ్చి పెళ్ళి చేసి, తనవద్దనే ఉంచుకున్నాడు.





# కుముదుడి మంచితనం

శివపురం గ్రామంలో వుండే, మాలతి అనే యువతి పూల కోసం గ్రామం చివర వున్న తోటలలోకి వెళ్ళింది. అక్కడ హఠాత్తుగా దొంగ ఒకడు ఆమె ముందుకు వచ్చి కత్తి చూపి బెదిరించి, "నీ వంటి మీది నగలన్నీ ఇచ్చేసెయ్యి. లేకపోతే పొడిచి చంపేస్తాను," అన్నాడు.

మాలతి మెడలో బంగారు గొలుసు ఒంటి పేటది వున్నది. రెండు చేతులకూ కలిపి నాలుగు బంగారు గాజులున్నాయి. కాళ్ళకు వెండి గజ్జెలున్నాయి. ఈ నగలు పోతే మళ్ళీ చేయించుకునేందుకు జీవితకాలం సంపాదన కావాలి! మాలతి ఏం చేయాలా అని ఆలోచిస్తూండగా, ఎక్కడి నుంచో యువకుడొకడు వచ్చి దొంగ మీద కలియబడ్డాడు. దొంగ వద్ద కత్తి వుంది. యువకుడి వద్ద ఆయుధమేమీ లేదు. అయినా యువకుడు ధైర్యంగా దొంగతో పోట్లాడి తరిమేశాడు. మాలతి ఆనందం కొద్దీ చప్పట్లు కొట్టి, వాడి సాహసాన్ని మెచ్చుకుని వివరాలడిగింది.

"నా పేరు కుముదుడు. నాకు చాలా విద్యలు వచ్చు. నా తండ్రి ముసలివాడు. ఇంట్లోనే వుండి ఏ వడ్రంగిపనో చేసి డబ్బులు సంపాయించమంటాడు. నేను బయట రకరకాల పనులు చేసి బోలెడు డబ్బు సంపాయిస్తూ, నా తండ్రిని చక్కగా చూసుకుంటున్నాను. మాకు మేమిద్దరమే తప్ప ఇంకెవ్వరూ లేరు. మాది పొరుగునున్న చంద్రాయపల్లె. ఇక నీ వివరాలేమిటి? ఆడపిల్లవు ఒంటరిగా ఊరిచివరికెందుకు వచ్చావు?" అని అడిగాడా యువకుడు.

"నా పేరు మాలతి. నాకూ తండ్రి తప్ప ఇంకెవ్వరూ లేరు. ఆయనకు ఎక్కడలేని డబ్బాశ. రకరకాల అత్తరులు చేసి అమ్ముతాడు. అత్తర్ల కోసం పూలు నేనే తేవాలి. చేసిన అత్తర్లూ నేనే అమ్మాలి. ఆయన ఎక్కు

"వసుంధర"



వగా కదలలేదు. తిరగలేక చస్తున్నానంటే వినడు. దొడ్లో కూరగాయలు పండిద్దామనీ, ఇంట్లో అప్పడాలూ, వడియాలూ చేసి అమ్ము దామనీ అంటే – అందువల్ల వచ్చే డబ్బు తక్కువంటాడు. డబ్బేం చేసుకుంటామంటే, అంతా నా పెళ్ళికోసమే అంటాడు. అన్నీ అబద్ధాలు. డబ్బాశమనిషి నాకు పెళ్ళయితే, ఈ సంపాదన పోతుందని ఆ ప్రయత్నం కూడా చెయ్యడు. ఈ రోజు నువ్వు రక్షించావు. లేకుంటే బంగారం పోయిందని మా నాన్న నానా తిట్లూ తిట్టేవాడు," అని చెప్పింది మాలతి.

ఇది విని కుముదుడు నొచ్చుకుంటూ, "కన్నతండ్రి దేవుడితో సమానం. ఆయన గురించి నువ్వలా మాట్లాడకూడదు. నీతండ్రి ప్రయత్నించక పోయినా, నీ పెళ్ళి దివ్యంగా జరిగిపోతుంది. బంగారు బొమ్మలా వున్నావు. నువ్వు నాకెంతో నచ్చావు. నీకిష్టమైతే నిన్ను పెళ్ళి చేసుకుని, నువ్వు ఇల్లు కదల వలసిన అవసరం లేకుండా చూసుకుంటాను," అన్నాడు.

"పెళ్ళి చేసుకునేందుకు ఇష్టం వుండాలి. నాకు నువ్వంటే ఇష్టంలేదు," అని మాలతి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

ఆ రోజు నుంచీ కుముదుడు, మాలతి కోసం నిత్యం ఆ ఊరుకు వచ్చేవాడు. ఆమెను పలకరించి కబుర్లు చెప్పేవాడు. ఆమెకోసం చెట్ల చివరకెక్కి పూలు కోసేవాడు. ఆమెకు చిన్న చిన్న బహుమతులిచ్చేవాడు. కానీ మాలతికి వాడిపై ఇష్టం కలగ లేదు.

అప్పుడప్పుడు పూలకోసం మాలతితో పాటు వస్తూండే అవ్వ ఒకతె, ఈ వ్యవహారం కని పెట్టింది. ఆమె మాలతి నడిగితే కుముదుడంటే తనకు ఇష్టంలేదని చెప్పేసింది. అవ్వ ఈ విషయం కుముదుడికి చెప్పి, "ఎందుకురా మనవడా, ఆ పిల్ల వెంటపడతావు? దానికి నీ మీద ఏ మాత్రం ఇష్టంలేదు. ఇక ఈ ఊరు రాకు," అన్నది.

"అవ్వా! నువ్వు పెద్ద దానివి, మంచిదానివి. మాలతికి నాపై ఇష్టం కలగాలంటే నేను ఏం చెయ్యాలో చెప్పవా?" అని జాలిగా అడిగాడు కుముదుడు.

"సాహసం చేశావు. బాగా పొగిడావు. కాను కలిచ్చావు. అయినా, దానికి నీ మీద ఇష్టం కలగ లేదు. ఇక ఒక్కటే మార్గం. నీకు తెలి యదు గనక చెబుతున్నాను; జాలిలోంచి కూడా ఇష్టం పుడుతుంది. అది నీ మీద జాలిపడే ఉపాయంచూడు!" అని వెళ్ళి పోయింది అవ్వ.

అవ్వ మాటలు బాగా గుర్తుంచుకున్న కుముదుడు మర్నాడు, మాలతితో, "ఈ ఊళ్ళో నాకు అంతగా పని దొరకడం లేదు. నిన్ను చూడకుండా వుండలేక, ఈ ఊరొస్తున్నాను. అందువల్ల నా ఆదాయం బాగా తగ్గి పోయింది. రోజూ తిండి గడవడమే కష్టంగా వుంది," అన్నాడు.

"అయితే ఈ ఊరికి రాకు," అని వెళ్ళి పోయింది మాలతి.

ఇది పనికాదని ఒకరోజున పూల కోసం చెట్టెక్కి, కావాలనే కిందపడ్డాడు కుముదుడు. వాడికి దెబ్బలు బాగా తగిలాయి. చేత కానప్పుడు చెట్టెక్కడమెందుకూ, అని ఈసడించి వెళ్ళిపోయింది మాలతి.

మరొక రోజున పూలుకోస్తున్న మాలతిని, పొదల చాటు నుంచి వచ్చిన పాముకాటెయ్య బోతూంటే, చటుక్కున దాని తోక పట్టుకుని లాగాడు కుముదుడు. పాము వాడిని కాటే సింది. పరుగున వెళ్ళిన మాలతి, వైద్యుణ్ణి తీసుకురాకపోతే వాడు మరణించే వాడే! వాడు కళ్ళు తెరిచాక, "ఆ పాము నన్ను కాటేస్తే బాగుండేది. వైద్యుడి కోసం ఆయాస పడుతూ



పరుగులు తీయడంకంటే, పాము కాటే సుఖం. ఉన్నచోటునే పడివుండవచ్చు," అన్నది.

ఈ మాట అవ్వ విని, మాలతిని చాటుకు పిలిచి, "కుర్రవాడు బుద్ధిమంతుడు, అందగాడు. నువ్వంటే ఎంతో ఇష్టం. ప్రాణాలకు తెగించి నిన్ను రక్షించాడు. నా మాట విని వాణ్ణి పెళ్ళిచేసుకో, సుఖపడతావు," అని చెప్పింది.

"ఏమో, అతనంటే నాకు రవ్వంత కూడా ఇష్టంలేదు మరి!" అన్నది మాలతి.

"అందుకు కారణం ఏమై వుంటుంది?" అని అడిగింది అవ్వ.

"మా నాన్న చూడు. నా చేత అడ్డమైన పనులూ చేయిస్తాడు, ఆడపిల్లనని జాలి పడ



"పోనీ అలాగే అనుకుందాం! అలాంటప్పుడు కుముదుడి వంటి పేదవాణ్ణి చేసుకుని, మా నాన్న మనసు కష్టపెట్టకూడదు కదా!" అన్నది మాలతి.

మర్నాడు అవ్వ, కుముదుడికి మాలతి మనసులోని మాట చెప్పింది. అప్పుడు వాడు, మాలతి వద్దకు వెళ్ళి, "నేను మా నాన్నను బాగాచూసుకోవడంలేదనినువ్వు పొరబడ్డావు. ఒక్కసారి ఆయన్ని కలుసుకుని మాట్లాడు. నీకు నా మీద వున్న అనుమానాలన్నీ తుడిచిపెట్టుకుపోతాయి," అన్నాడు.

ఏకళనుందో ఇందుకు మాలతి సరేనని, "రేపే నేనుమీ ఊరు వెళతాను. కానీ, అప్పుడు నువ్వు మీ ఊళ్ళో వుండకూడదు!" అన్నది.

దీనికి కుముదుడు సరేనన్నాడు.

మరుసటి రోజున, పొరుగూరిలో అత్తరుకు మంచి గిరాకీ వుందని తండ్రికి చెప్పి, అవ్వను సాయం తీసుకుని బయలుదేరింది మాలతి. ఇద్దరూ కలిసి వెళ్ళి చూస్తే, కుముదుడి ఇల్లు ఇంద్రభవనంలాగుంది. అందులో మహారాజులా వెలిగిపోతున్న ఒక ముసలాయనే కుముదుడి తండ్రి. ఇంట్లో అన్ని అవసరాలూ చూడ్డానికి ఒక వంట మనిషీ, పనివాడూ వున్నారు.

ఇది చూసి మాలతి ఆశ్చర్యపడుతూ ముసలాయన్ని పలకరించి, తను తెచ్చిన అత్తరు గురించి చెప్పి, "ఇంట్లో ఇంకెవ్వరూ లేరా?" అని అడిగింది.

కుండా! అలాంటిది, మగవాడిని ఇంటిపట్టున వుండి బుద్ధిగా ఏ వండ్రంగం పనో చేయమని కోరే ముసలితండ్రి మాటకాదని, ఇలా రోజూ ఊళ్ళవెంట తిరిగే కుముదుడంటే, నాకెలా ఇష్టమవుతుంది?" అని జవాబిచ్చింది మాలతి.

ఇందుకు అవ్వ నవ్వి, "తెలియక నువ్వు, మీ నాన్నను తప్పు పడుతున్నావు. ఆయన సంపాదించినదంతా నీ నగల కోసం, పట్టు చీరలకూ,కట్నం డబ్బుకూ దాస్తున్నాడు. నువ్వు ఇంటిపట్టున వుంటే, ఉన్న డబ్బుతో మీకు పూట గడుస్తుంది తప్ప, ఇంత ఆస్తి రాదు. మీ నాన్న నీకు చాలా మంచి సంబంధం చేయాలనుకుంటున్నాడు," అన్నది.

ఇందుకు ముసలాయన అయిష్టంగా, "ఉన్నాడు. ఒక్కగానొక్క కొడుకు. పేరు కుముదుడు. అన్నీ లేకిబుద్ధులు. ఇంటి పట్టున వుండి ఏ వడ్రంగమో చేసుకోరా అంటే, ఊళ్ళ వెంట తిరుగుతూంటాడు. నా మాట వినడు!" అన్నాడు.

అప్పుడు అవ్వ కల్పించుకుని, "మీరు బాగా ఆస్తిపరులులాగున్నారు. మీ వాడు ఇంట్లో వుంటేమాత్రం వడ్రంగంచేసుకోవడమెందుకు? కాలు మీద కాలేసుకుని కూర్చున్నా హాయిగా గడిచి పోతుంది," అన్నది.

"ఆహాఁ, మేలు, మేలు! పంఠంటి సలహా ఇచ్చావు," అంటూ ముసలాయన వెటకారంగా నవ్వి, "అలా అనుకునే నాకు నా పెద్దలిచ్చిన ఆస్తినంతా హారతి కర్పూరం చేశాను. మా కుముదుడికి పదిహేనేళ్ళు వచ్చేసరికి పూరి గుడిశెలోకి మారాం. వైద్యానికి డబ్బు లేక నా పెళ్ళాం చచ్చిపోయింది. ఆమె బెంగతో నేను మంచం పట్టాను. అప్పట్నించీ కుము దుడు సంపాదనలో పడ్డాడు. ఈ అయిదేళ్ళ లోనూ ఈ భవనం కొన్నాం. పనివాళ్ళను పెట్టు కున్నాం. మొదటి నుంచీ దర్జాగా బతికినవాణ్ణి. అందువల్ల, ఇలా తప్ప వుండలేను," అన్నాడు.

"మీ కుమారుడు, మా ఊరొస్తూంటాడు. చూడ్డానికి పేదవాడిలాగుంటాడు. అదే రకం తిక్క?" అన్నది అవ్వ.

ఇది వింటూనే ముసలాయన పెద్దగా నవ్వి, "అదేం తిక్క కాదు. నేనే వాణ్ణి అలా



వుండమని చెప్పాను. చిన్నప్పటి నుంచీ దర్జా అలవాటైతే, నాలాగా ఇబ్బంది పడాలని నా భయం. వాడి పుట్టుకతోనే నా ఆస్తి పోవడం మొదలు. వాడికే అదృష్టముంటే నా ఆస్తి పోయేదే కాదు. ఇప్పుడైనా నా అదృష్టం కొద్దీ వాడికి నాలుగు డబ్బులు దొరుకుతున్నాయి. వాడు సంపాదించేది నాకు మాత్రమే సరిపో తున్నది. చేతకాని దద్దమ్మ కాబట్టే తన కోసం కూడా సంపాదించుకోలేక పోతున్నాడు," అన్నాడు నిరసనగా.

తర్వాత మాలతి అత్తరు చూపిస్తే, ముసలా యన మొత్తంఅంతాకొనేసి, "నీ అదృష్టం కొద్దీ వాడు లేనప్పుడొచ్చావు. వాడుంటే ఇదంతా దండగ ఖర్చు అంటాడు. అంతేకాదు, ఇంటికి

సారా తెప్పించుకుని తాగితే, ఆరోగ్యం పాడవుతుందంటాడు. ఆరోగ్యం పాడైతే త్వరగా చస్తాను. వాడికీ ఖర్చు తగ్గుతుంది. వాడికే లాభం కదా? ఏం చెప్పినా అర్థం కాదు," అన్నాడు.

మాలతి, అవ్వ అక్కణ్ణించి తిరుగుప్రయాణ మయ్యారు. అవ్వ, మాలతితో, "తండ్రి నీ ఎదట తనను మెచ్చుకుంటాడని కుముదు డాశపడ్డాడు. వాడికీ నీకూ పెళ్ళి యోగం వున్నట్టు లేదు," అన్నది.

మాలతి, అవ్వకేమీ బదులివ్వకుండా తన ఊరు చేరుకుంది. అక్కడెదురైన కుముదు డితో, "మీ నాన్నను చూశాను," అన్నది.

కుముదుడు నవ్వి, "నేనూ మీ నాన్నను చూసి మాట్లాడాను. ఆయన నా గురించి అంతా విని, నాకు అత్తరు చేయడం నేర్పుతా నన్నాడు. తన డబ్బంతా మనదేనన్నాడు. కొన్నాళ్ళు మనమీ ఊళ్ళోనే వుంటే, తను మా నాన్న దగ్గరకు వెళ్ళి కోడలిని బాగా చూసుకునే పద్ధతులు నేర్పివస్తానన్నాడు. మన పెళ్ళి నిశ్చయమైపోయింది!" అన్నాడు.

"నేను మన పెళ్ళికి ఒప్పుకుంటానని ఎలా అనుకున్నావు?" అన్నది మాలతి ఆశ్చర్యంగా.

"ఎలా అనుకున్నానో చెప్పమంటావా? అయితే విను. అవ్వ చెప్పే వరకూ, నాకీ ఆలో చన కలగనే లేదు. మా నాన్నను కలుసుకున్న నా శత్రువులు కూడా, నా మీద జాలిపడి నన్న భిమానించారు. నువ్వెందుకు జాలిపడవు? జాలిలోంచి ఇష్టం పుడుతుందని అవ్వ చెప్పనే చెప్పింది!" అన్నాడు కుముదుడు.

కన్న తండ్రి అయివుండీ, ఇతరులతో తనను గురించి ఒక్క మంచిమాట అనక పోగా, తనపట్ల శత్రువులా ప్రవర్తించే తండ్రికి సకల సదుపాయాలూ చేసిన కుముదుడి మంచితనమూ, పెళ్ళయ్యాక కూడా కూతురి సుఖం గురించే ఆలోచించే తన తండ్రి మన స్తత్వమూ గురించి బాగా ఆలోచించిన మాల తికి — కుముదుడిపై జాలితోపాటు ఇంతం తనరాని ప్రేమ కలిగింది.

ఇది జరిగాక, తండ్రుల ఆశీర్వాదంతో మాలతీ, కుముదుల వివాహం అతి నిరాడంబ రంగా జరిగిపోయింది.



# ప్రకృతి వింతలు!




## ముండాంతురై అడవులు!

తమిళనాడులోని ముండాంతురై రిజర్వ్‌డ్ అడవులు ఇటీవల అందరి దృష్టినీ ఆకర్షిస్తున్నది. దీనికి రెండు ముఖ్య కారణాలు ఉన్నాయి. మొదటిది అక్కడ పులుల సంఖ్య పెరగడం. రెండవది అక్కడ ఆరేళ్ళ క్రితం తలపై జుట్టుగల వాగుడు పిట్ట (వార్‌బ్లర్) కనిపించడం. రకరకాల వాగుడు పిట్టలు ఇప్పుడు కూడా వస్తున్నాయి కాని, జుట్టుగల వాగుడు పిట్ట మాత్రం కనిపించడంలేదు. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన మధుసూదన్ కట్టి అనే భారతీయ యువకుడు, ఈ పక్షుల గురించి పరిశోధిస్తున్నాడు. అతడు ఇది వింత గొలిపే విషయంగా భావిస్తున్నాడు. అయితే, మద్రాసు సమీపంలోని వేడంతాంగల్ పక్షులశరణాలయానికి అప్పుడే రంగు రంగుల కొంగలు, తీతువు పిట్టలు, వాగుడుపిట్టలు, సైబీరియా బాతులు మొదలైన రకరకాల పక్షులు రావడం — పక్షుల అభిమానులందరికీ ఆనందం కలిగించే విషయం. మనదేశంలోని ప్రాచీనమైన పక్షులశరణాలయాలలో వేడంతాంగల్ ఒకటి.

## తిమింగిలాల ఆత్మహత్య!

న్యూజీలాండ్, నెల్సన్‌లోని 'ఫేర్‌వెల్ స్పిట్' సముద్ర తీరంలో ఈ వింత సంఘటన జరిగింది. మామూలుగా లోతైన సముద్ర జలాలలో హాయిగా తిరిగే దాదాపు 99 తిమింగిలాలు సముద్రతీరానికి చేరాయి. ఒకదాని పక్కన ఒకటి చేరడంతో ఆ తొక్కిసలాటలో ఊపిరాడక కొన్ని తిమింగిలాలు ప్రాణాలు కోల్పోయాయి. వాటిని కాపాడడానికి పూనుకున్న కొందరు, తిమింగిలాలను లోతైన నీళ్ళల్లోకి నెట్టడానికి ప్రయత్నించారు. అయినా, 43 తిమింగిలాలను కాపాడలేక పోయారు. ఇంతకూ ఆ తిమింగిలాలు ఎందుకు ఇలా మూకుమ్మడిగా ఆత్మహత్యకు పాల్పడ్డాయో విజ్ఞానవేత్తలకు ఇంకా అంతు బట్టలేదు.



## పక్షుల లెక్క

మీకు బడిలేనప్పుడు మీ ప్రాంతంలోని పక్షులను లెక్కపెట్టగలరా? సాధ్యం కాదంటారు! అంతే కదా? అయితే, గత నవంబర్ 14వ తేదీ మన దేశంలో 5,000 మంది పక్షులను లెక్కపెట్టడానికి ఒప్పుకున్నారు. అలా ఒప్పుకుని తమ పేర్లను నమోదు చేసుకున్న వారికి మామూలుగా కనిపించే 170 పక్షుల పేర్లుగల ఒక జాబితాను ఇచ్చారు. ఒక్కొక్కరూ తాము చూసి లెక్క పెట్టిన పక్షుల సంఖ్యను ఆ జాబితాలో నింపి ఇవ్వాలి. ఇది ఒకే రోజు జరగాలి. ప్రముఖ భారతీయ పక్షి శాస్త్ర వేత్త డా॥ సలీం అలీ జ్ఞాపకార్థం ఈ పథకాన్ని చేపట్టారు. నవంబర్ 12 ఆయన జన్మదినం. దానికి సమీపంలో ఉన్న సెలవు రోజును పక్షులు లెక్కించడానికి తీసుకున్నారు. మునుముందు ఇది యేటా జరగవచ్చు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. SESHAGIRI



S.G. SESHAGIRI

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వేషం కాదు, బ్రతుకు తెరువులో... రెండవ ఫోటో : మోసం లేదు, ముసుగు తెరలలో!

పంపినవారు : ఎం.వి. శరత్‌బాబు,

1-8-430/15, చిక్కడపల్లి, హైదరాబాదు - 500 020.

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**



చందమామ విజయా
కంబైన్స్

# భైరవద్వీపం

నిర్మాత
బి.వెంకట్రామరెడ్డి

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
సింగీతం శ్రీనివాసరావు

Go ahead Try-Me!



ఇంకొక ఇంటిలోకి
మేము మారినప్పుడు...
ఆ బిల్డింగ్‌లో పిల్లలందరూ
ఎంతో హాయిగా ఆడుకుంటూ
వున్నారు. నా గురించి ఎవరూ
పట్టించుకోలేదు. ఎలా వీళ్ళని ఫ్రెండ్స్
చేసుకోవడం.. మ్.. ఆ..

ఐడియా వచ్చేసింది ! ఒక ట్రై-మీ
నోట్లో వేసుకున్నాను ! టక్ టక్ అని తిన్నగా
వెళ్ళి వాళ్ళకి యిచ్చాను బోల్డన్ని. "మ్ రండి -
ట్రైమీ !" అంతే ! ఒకే రోజులో అయిదుగురు
నా ఫ్రెండ్స్ అయిపోయారు







Try-Me!

సవాలు చేసే కొత్తరుచి

HTA-8507

Telugu)

మరపు రాని ఆశ
మధురమైన ఆశ

nutrine Aasay




ఉచితం!
25 ఆశ రేపర్లు
P.B No: 2574, Madras-31
కు పంపి, అందమైన 6
స్టాంప్ స్టిక్కర్లు ఉచితంగా
పొందండి




ఈ అవకాశం లేకుండా ఆశ లభిస్తుంది